## —: ముఖ్య పాత్రలు :—

శ్రీరాముడు

లక్ష్మణుడు

భరతుడు

శత్రఘ్నుడు

యయాతి

ఆంజనేయుడు

సుగ్రీవుడు

అంగదుడు

విశ్వామిత్రుడు

వశిష్ఠుడు

జాబాలి

గౌతముడు

నారదుడు

### స్త్రీలు

అంజనీదేవి

శాంతిమతి

ఇంకను సమయానుకూలముగ

ఓమ్

# శ్రీ రామాంజనేయ యుద్ధము

## ప్రథమాంకము - ప్రథమ రంగము

నాంది

గురుడు వచించినట్టి పలుకుల్విని, తాటకినిన్ వధించి యా
యురుతరమైన యాగవిధినోమి. అహల్యనుగాచి, జానకీ
తరుణిని పత్నిగా బడయు దాశరధీ సభనేలుగాత తా
నిరతము భాగ్యభోగ్యము లనేకములిచ్చి ముదంబు మీరగన్.

(నాంద్యంతమున సూత్రధారుడు ప్రవేశము)

సూత్ర—నటీ! నటీ!

నటి—నాధా! ఏమి, యింత తొందరగ బిలిచితిరి.

సూత్ర—నీ కింకను తొందరగ బిలిచిన కారణమేదియో తెలియనే లేదా? వెంటనే శ్రీరామాంజనేయుయుద్ధమను భక్త యయాతిచరిత్ర నాటక రూపమున ప్రదర్శింప వలయునుగాన తత్ప్రయత్నమున నుంటివా?

నటి—నేనందు మందమతినై చరింతునా?

సూత్ర—అటులైన నేనే సభాసదులకింకను యీ కవిగారి యూరు పేరులం గూర్చి తెలుపక జాగొనరించితి నన్నమాట? ఓమహాజనులారా! నేడు ప్రదర్శింపబోవు యీ నాటకమును రచించిన దెవరంటిరా!

సీ. గుంటూరు సీమలో కొమరొప్పు విద్దెల
పూడి నివాసుండు; భూసురుండు
నిరతాన్నదాతయు నిత్యసత్యవ్రత
దీక్షాపరుండు, ముక్తి పరుడు,

రంగయాఖ్యుండు, భారద్వాజ గోత్రుండు,
దచెళి వంశాబ్ధి సుధాకరుండు,
అర్ధాంగ లక్ష్మి బాయమ్మ నవ్వారికి
జననమందెను శేషయాఖ్యుఁ డెలమి

గీ. వారి పత్ని లక్ష్మమ్మ గర్భంబునందు,
గలిగె నేకైక పుత్రుండు; కవివరుండు:
వీరరాఘవస్వామి నా పేరవెలసి
దీని రచియించె సరస విధానముగను.

నటి—నాథా ! ఆ రాఘవస్వామిగారి రచనయు నానందకరముగనే యుండుసు గాన తప్పక దానినే ప్రదర్శింతము. అదిగో నారదపాత్ర సిద్ధమైనది.

సూత్ర—ఐన మనమింక దారి తప్పుకొందుము పద. నాటకారంభము కాగలదు.

నటి—అటులనే.

(ఇరువురు నిష్క్రమింతురు.)

---

(గగన మార్గంబున నారదుడు ప్రవేశము.)

నార—ఆహా ! కలహభోక్తనగు నాకు కొన్నాళ్లనుండి యుపవాసంబులే జరుగుచున్నవిగదా? ఇపుడెందు బోవుదును? ఎవరికి కయ్యంబును బెట్టుదును ?

సీ. దేవదానవులకు తీరని వైరంబు
విడత కొన్నాళ్లు కల్పించినాడ
ఆది విష్ణువుచేత నవతారములనెన్నొ
తిరిగి ధరిత్రి నెత్తించినాడ
మర్త్యలోకముఁజేరి మాయమాటలతోడ
పెద్ద కయ్యంబు లా పెట్టినాడ

యుక్తిమీరగ శాయశక్తుల యత్నించి
మంచి తగవుల సృష్టించినాడ

గీ. కాని, నేటి కీ గతి నాదు కడుపునిండు
మార్గమొండు గన్పడబోక మాడుచుంటి
నెచట కలహంబు ప్రాప్తించు ? నెపుడు దీరు
నీ క్షుధానల జ్వాల లించెపెసగ నాకు ?

ఔరా ! భూలోకంబున రామచంద్రుడు ధరణిని పాలించుచుండ నాకు కలహము లభించు మార్గంబు గోచరింపదే ? నేనేమి చేయుదును ? (ఆలోచించి) ఆహా ! ఈ నదీ ప్రాంతము నందున్న పర్ణశాలలో విశ్వామిత్ర వశిష్ఠు లిరువురు గూర్చుండి యుండిరి. వారున్నచోట నేదేని వైరంబు సంభవింపక బోదు. ఆ సమయంబున నే నందుండి వశిష్ఠ విశ్వామిత్రుల మధ్య నంకురించిన నా కలహ బీజమును పెంచి పెద్దదానిని చేసినచో, అయ్యది వృద్ధిచెంది, నా కానందము నొసంగుట నిశ్చయము గాన త్వరితముగ నే నా ముని నివాస ప్రదేశంబున కరిగెద. ఆహా ! దేవదేవా ! నిన్ను నమ్మిన వారి కే కొరతయు నుండదుగదా ?

సీ. మీనావతారమై దానవుని వధించి
వేదములను నిల్పు విజ్ఞు డెవడు ?
కూర్మావతారమై కొండ క్రిందను జేరి
పాల సంద్రమునందు గ్రాలె నెవడు ?
అరయ వరాహమై యా హిరణ్యాక్షుని
పోరాడి చంపిన ధీరు డెవడు ?
రాకాసి మూకలు చీకాకు చేయ ప్ర
హ్లాదుని బ్రోచిన యనఘు డెవడు ?

గీ. దుష్ట రాక్షస కోటిని దునిమె నెవడు ?
కపి వరేణ్యుల సంప్రీతి గాచె నెవడు ?
ఆ మురారి నిజాంశంబు నలరునట్టి
దాశరథియే సహాయమై దనరు నింక.

కావున నేనింత త్వరితంబుగ నరిగెద. (నిష్క్రమించును.)

## (2 వ రంగము)

[వశిష్టుడు, విశ్వామిత్రుడు, గౌతముడు, జాబాలి వేరు వేరుగ కూర్చుండియుందురు.]

గౌత—నేడీ మునిజన సమ్మేళన మెంతయు నానంద మొదవించు చున్నది.

జాబా—నేటి వేదాంతచర్చయు మిగుల ప్రశంశనీయముగనే యున్నది.

విశ్వా—(ఎదుటచూచి) ఆ వచ్చున దెవరు ?

వశి—(నిదానించిచూచి) నారదునివలె నున్నది.

(నారదుడు ప్రవేశము)

వశి—నారదా ! రమ్ము. కూర్చుండుము.

విశ్వా—బ్రహ్మమానసపుత్రా ! ఇటువచ్చి కూర్చుండుము.

గౌత—త్రిలోకసంచారీ ! ఎచటనుండి నీరాక ?

జాబా—కలహాశనా ! లోకంబులనున్న వార్తలేమియో వివరింపుము.

నార—మునీంద్రులారా ! మీ రంద రెరుంగని వార్తలు నాకు మాత్రము తెలియునా ? ప్రస్తుతము నేను భూలోకమునుండి వచ్చుచున్నాను. అందెందు చూచినను శ్రీరామచంద్రుని ప్రతిభయేగదా ? ఆహా ! ఏమి రాముని పరిపాలనా విధానము ? ఏమి న్యాయైక దీక్ష ? ఏమి ప్రజాదరణ ?

చ. ఇనకులరామచంద్ర భువనీశుడు, కీర్తియుతుండు; ధర్మపా
లనమున తొల్లి భూమిపతులన్ నిరసించెనటంచు నెందు చూ
చినను వచించు వారలె విశేషములై కనుపించుచుండి రా
యనఘుని శీలసంపద లనంతము లయ్యె ధరాతలంబునన్.

వశి—ఔను, ఆతండు దశరధనందనుండు. ఆ వంశీయులందరు నట్టి యశోభరిత చరితులే.

విశ్వా—శ్రీరాముడు నాశిష్యుండుగదా ?

(యయాతి ప్రవేశము.)

యయా—వశిష్ఠ భగవానులవారి కభివాదములు.

ఉ. కోసల రాజచంద్రులకు కూర్మి బురోహితులై; మునీంద్రులన్
వాసి ఘటించి, సాధుగుణ వర్తన మందసమానశీలురై
భాసురమూర్తియై ధరణి ప్రాభవమందు వశిష్ఠ మౌనికిన్
చేసెద వందనంబులు నశేష శుభంబులు పెంపునొందగన్.

వశి—దీర్ఘాయుష్మాన్ భవ.

నార—(రహస్యముగ) విశ్వామిత్రా! ఇందు నీవుండగ నీ **యయాతి** మునుముందుగ, నీ యరుంధతీ పతికి నమస్కరించు చున్నాడేమి ?

విశ్వా—(నిర్లక్ష్యముగ) నారదా! అంతమాత్రమున నా గౌర వంబునకేమి లోటు ?

నార—(రహస్యముగ) ఎంతమాట? గౌరవభంగము కాకపోవు టేమి ? కౌశికా! నీవేమనుకొను చుంటివోగాని, నాకుమాత్రము యయాతి కృత్యము దుస్సహముగనే యున్నది. ఐనను, నీవెక్కడ ? ఈ వశిష్ఠు డెక్కడ ? నీకంటె నీవశిష్ఠు డధికుండేమి ?

విశ్వా—(రోషమును పూరించుచు నుండును.)

యయా—(విశ్వామిత్రుని వంకచూచి) ఓహో! గాధిపుత్రులు నిందేయుండిరా! ఎంత పొరపాటు. (చేతులు జోడించి) మహామునీ!

మ. జననంబందితి వర్క వంశమున; భూచక్రంబు పాలించియున్
ముని లోకంబున నగ్రగణ్యుడవునై ముల్లోకముల్ మెచ్చ నూ
తన సృష్టిన్ సృజియించినాడవు మహాత్మా! నీకు కేల్మోడ్చి నా
డను దాసుండను గాన నన్ను కృపనిండన్ గాంచి రక్షింపవే.

విశ్వా—ఓయీ! కపటహృదయా! చాలింపు మీ యాగడము.

నార—అదేమి కౌశికా! యయాతి నమస్కరించెనుగదా? ఈపాటిదానికింత యాగ్రహమా!

విశ్వా—నారదా! నన్నూరక వాగింపకుము. ఈ దుర్మార్గుడు ముందుగ వశిష్ఠున కంజలి యొసంగి కడమనాకు నమస్కరించునా?

యయా—(చేతులు జోడించి) మహామునీ! ఇదియా నా వలన గలిగిన మహాపరాధము! నమస్కరించుట యందును ముందు వెనుక లుండెనా? ఉండిన యుండుగాక, నా మనంబున నా బేధబావంబు లెరింగి చేయలేదు.

గీ. దీర్ఘకాలంబు వేటకై తిరిగి తిరిగి
మిగుల డస్సియుంటిని, సంయమివర! ఎవ
రెవ్వ రిందుగల రటంచునేని గనక
సహజలీల, వానికి నమస్కారమిడితి

అంతియేకాని నా మనంబు నందొండు తలంపు జనించుటచే కాదు. నన్ను మన్నింపుము.

విశ్వా—యయాతీ! వృధా వ్యాసంగమేల? వశిష్ఠుడు మీకిష్టుడై యుండుటచేత నన్నాతనిముందు పరాభవించు తలంపున నిట్లు చేసితివి. తిరిగి మామకోగ్రశాపదవాలనాగ్రంబుల భస్మంబగుదువేమోనన్న భయం బున నిట్లు సమర్థించుకొన చూచుచుంటివి. ఓయీ! మాయావీ! నీకే యింతటి యుక్తియున్న నిరంతర తపోనిష్ఠా గరిష్ఠులమై—వివిధ విద్యా ప్రపూర్ణులమై—సర్వలోకానుభవ పరులమైన మా కెంతటి విజ్ఞాన ముండ వలయును?

మ. తులువా! ఇంత పరాభవంబయిన నాతో నిట్టి హాస్యంబులే
పలుకన్ సాహసమేల కల్గెనుర గర్వప్రక్రియన్ సర్వమా
నులు చూడన్ తలవంపులయ్యె, మదికిన్ నూనంబు గావించితే
బలవద్వైరముగల్గు హేతువున కోపజ్వాల చల్లారునే?

యయా—మహాత్మా! శాంతింపుము.

విశ్వా—శాంతించి చిరకాలమైనది. ఇదే, మదీయశాప ఫలమనుభ వింపుము. (కమండలములోని నీరు చేతిలో వంచబోవును.)

నార—(వారించి) కౌసికా! ఇంత తొందర పడుచుంటివేమి? ఇంతకాలము జితేంద్రియుడవై, ఘోరనిష్ఠలతోచేసి గడించిన నీ తపోబల మీ యొక్క నరనాయకుని చంపుటకై వినియోగింతువా! చాలు చాలు. యయాతి మరణమునకు నీ పవిత్ర తపస్సునే ధారవోయుటకు మతి పోయినదా యేమి?

విశ్వా—అటులైన యేమిచేయవలయును?

నార—యయాతిని చంపుటమాత్రము నిశ్చయించుకొంటివిగదా? కానిమ్ము. కార్యసాధనా విధానము నిదానముగ యోచింతము.

యయా— (స్వగముప) అమ్మయ్య! నారదమునీంద్రులవారి వలన నిప్పటి కొక గండము గడచినది. ఐనను గాధేయుని పగ పాము పగ. ఈతడు నన్ను పూర్తిగా కరుణించి విడిచినగదా సంతోషము.

గీ. కౌశికుం డుగ్రశాపాన గాల్చియున్న
చీకు చింతలేకుండ నశించియుందు;
బ్రతికియున్నకతన మృత్యుభయముకలిగె
చావకయు ముదమంద నీ సమయమందు.

విశ్వా—ఓయీ! యయాతిరాజా! బ్రతికిపోయితినిగదా యని గర్వించెదవేమొ; ఇది తాత్కాలికమే సుమా.

వశి—విశ్వామిత్రా! యయాతి యొనరించినకార్యము వుచితమా? అనుచితమా యను ప్రశ్న నటుంచుము. నీ వనినట్టు లయ్యది దూష్యంబే యైనను నిన్నాతడు క్షమాభిక్ష నర్థించెనుగదా? వానినేల క్షమింపరాదు?

విశ్వా—ఓయీ! పాపిష్ఠి వశిష్టా! నన్నట్లు ప్రశ్నించుటకు నీ వెవరవు? చేతనైనచో నీ యయాతిని రక్షించుకొనుము—చేతగాకున్నచో నోరుమూసుకొని కూరుచుండుము.

వశి—ఏమిరా ! దురహంకారప్రమత్త చిత్త స్వరూపా ! ఏమంటి వేమంటివి ? నోరుమూసుకొని కూరుచుండవలయునేమి ?

ఉ. తాలిమిలేక యీ పగిది తామసమూని వివాద మాడగా
కాలును ద్రవ్వుచున్న పలుగాకి ! మునీంద్రుల కిట్టి రోషమే
వేళనునైన చెల్లునె ? వివేకమె ? కీర్తియె ? సిగ్గులేక నిం
దేల వచింతువింక నగరే ప్రజలందరు నాలకించినన్.

విశ్వా—ఓయీ ! మూఢా ! ఏమంటివి ? నాకురా వివేక విఖ్యాతులు లేకపోయినవి ? ఈ విశ్వామిత్రుని శక్తిసామర్థ్యంబు లింతలోనే మరచితివా ?

సీ. బ్రహ్మ సృష్టిని వీడి: బదులు సృష్టి రచించి
పూజిత మెల్లెడ పొందినాడ;
అపర స్వర్గంబునే నవలీల గల్పించి
యల త్రిశంకు నచట నిలిపినాడ;
హిమశైలమందు, నహీన తపస్వినై
ఫాలనేత్రుని మెప్పు బడసినాడ;
నీదు పుత్రులనెల్ల నేత్రానల జ్వాల
భస్మంబు చేసియే వరలినాడ;
గీ. ఘన హరిశ్చంద్రు నానాడు కడు యిడుముల
ముంచి, కచ్చియ దీర వేధించినాడ;
అట్టి పౌరుషశాలినై యలరు నన్ను
స్వల్ప గతి వల్కినావె, భ్రష్టా ! వశిష్ట !

వశి—ఓరీ ! ఆత్మశ్లాఘ పరాయణా ! హరిశ్చంద్ర సార్వభౌము నట్లు నగచాట్ల బాలుచేసితివే గాని, వానిచే నేమైన నసత్యము నాడింప గల్గితివా ? తుట్టతుదకు "రావయ్యా ! వశిష్టా !" అని బ్రతిమిలాడిన నాటి మాటల నింతలోనే మరచి పోయితివా ? నీవు మరచి పోయినను మేము మరచి పోలేదు సుమా ! నాడు జరిగిన శృంగభంగమునకు సిగ్గు బడవలసిన వాడ వింకను చెప్పుకొను చుంటివిగా ? చాలు చాలు. నోరు కట్టిపెట్టు కొనుము.

జాబా—వశిష్ఠా! ఎన్నడో జరిగిపోయిన మాట లిపుడెందులకు? పోనిండు. గతము వర్జనీయము.

వశి—ఆమాట లీగాధేయునకే చెప్పుడు. ముందా విషయంబులను ప్రస్తావనకు దెచ్చిన దాతడేగదా?

గౌత—విశ్వామిత్రున కేనియు నీపని బాగులేదు.

విశ్వా—ఏమోయీ! గౌతమా! నీవును యొక పేరుచెందిన మునీంద్రుని చందమున నన్నాక్షేపించు చుంటివిగా? నీబ్రతుకు లిందున్న వారంద రెరుంగ రనియా నాతోడ కోడెగము లాడుచుంటివి?

> గీ. అల సురేంద్రునితోడ నర్ధాంగి యింట
> కులుకుచుండ; నద్దమరేయి, కొంపవీడి
> స్నాన మొనరింతునను నొకసాకుతోడ
> బైట తిరిగెడు నీదొక్క బ్రతుకె చెపుమ!

నార—(స్వగతము) ఔరా! ఈ దుర్మార్గుని నోటికి హద్దు పద్దులు లేకున్నవిగదా?

గౌత—(స్వగతము) ఛీ! ఛీ! ఈ వాచాలుని కదిలించుట నాదే పొరపాటు.

వశి—(స్వగతము) పాపము. నిజమాడబోయిన గౌతముడెట్టి మాటబడెను?

జాబా—(స్వగతము) నేనేదేని వానిననిచో నాకును నేదియొనొద్దు రాకబోదు.

యయా—(స్వగతము) అకటా! నామూలమున ప్రశాంతంబగు నీ ముని యాశ్రమంబున నెంతటి కల్లోలము సంభవించినది. (ప్రకాశముగ) గాధిరాజనందనా! మన్నింపుము. దేవరవారి కీయాగ్రహంబు గావించినది నాలోపముగాని, మరొకరి నేరముగాదు. నాకై మీరు వృధా కయ్యంబు లాడనేల? తప్పుచేసినది నేను—తప్పని యొప్పుకొను చున్నది నేను.

దాసునిమీద కోపము దణ్ణముతోసరి. మీ పాదంబు లంటుచున్నాడ మన్నింపుము.

విశ్వా—(దూరమునకు తొలగి) ఆఁ! ఆఁ! పాపీ! ఎంత సాహసము? ఎంత సాహసము?

గీ. సాధు జీవుల జంపు హస్తంబులవ్వి;
కడగి నావైరికి మ్రొక్కు కరములవ్వి;
కడుగనైన కడుగకె నా మడిమలొత్త
తాకుచుంటివే? దోషంబు నాకు నంట.

యయా—హరిహరీ! ఇదియును నేరమయ్యెనా?

విశ్వా—యయాతీ! ఎందులకింక నీ వృధాప్రయాస? ఏ క్షణంబున నీవా వశిష్ఠున కంజలి యొనరించితివో, ఆ క్షణమందె నీవు నాకు ప్రబల విరోధివైతివి. నీ కపట వినయంబులకు మోసపోయి నిన్ను కరుణించుట కల్ల. నీవింక జీవితంబుపై భ్రాంతివదలి, మరణమునకు సిద్ధము కమ్ము. నేనును బోవుచున్నాను.

(నిష్క్రమించును)

నార—ఆహా! విధివిలాస మెంత విచిత్రమైనది?

గీ. గాధి సూతి వశిష్ఠుల కలహమిటులు
ప్రబలమంది యయాతిపై బడెనుగాదె?
రాజు రాజుల యుద్ధంబు ప్రజల మరణ
మనిన సామ్యంబు సార్థక మయ్యెనిచట.

అరుంధతీ సతీ! పాప మీ యయాతికి కల్గిన దురవస్థ విచారణీయము. విశామిత్రుండన్న నో యుక్తాయుక్త విచక్షణా శూన్య చరిత్రుండు. ఈ సమయంబున నీవును మిన్నకున్నచో పాపము, కాశీపురాధీశ్వరుని గతియేమి కానున్నదో కదా?

వశి—(స్వగతము) హౌరా! ఈ నారదుండు నా తలపై నొక భారమును దెచ్చి బెట్టి చూచుచుండెనే? (ప్రకాశముగ) నారదా! నీనెరుంగని ధర్మమార్గము లేమున్నవి? ఇందు నేను చేయదగిన దేమున్నది?

నీవు త్రిలోక సంచారివి— ఇట్టి ఘట్టంబు లందెట్లు లు చరింపవలయునో బాగుగ నెరింగిన మేధావివి— దేశకాల పాత్రానుకూలముగ వర్తింప నేర్చిన లౌకికవ్యవహార విజ్ఞానివి యయాతీ ప్రాణరక్షణకు నీవే కంకణము గట్టుకొనుము.

గౌత——బ్రహ్మమానస పుత్రా ! ఇందులకు నీవే సమర్థుడవు.

జాబా——మనమందరి సముఖంబున జరిగిన యీయన్యాయమునకు న్యాయంబు గల్పించుట మన ధర్మము.

వశి——యయాతి మహారాజా ! చింతింపకుము.

ఉ. చింతిలబోకుమయ్య నృపశేఖర ! కాగల కార్యమెట్టిదో
సుంత నెరుంగ జాలుదుమె ? శోక విదూరుడునైన జానకీ
కాంతుడు ధర్మపాలకుడు గల్గిన ధారుణిలోన, ధర్మమిం
కంతము నొందునా ? నిజము నా భగవానుడు చూడకుండునా ?

యయా——మహనీయా ! భగవానుడు నిజమునే చూచుచుండిన యీ యుపద్రవమేల సంభవించును ?

సీ. కుడిచి కూర్చుండక-నడవుల వేటాడు
పనిబూని నేడేల వచ్చినాడ ?
వచ్చితి ననుకొన్న-వైశమబోవక
జాల మిందేల నే సలిపినాడ ?
సలిపితి ననుకొన్న-సంయమీంద్రుల జేరి
దర్శింప నేనేల దలచినాడ ?
దలచితి ననుకొన్న-తగగాధిసూతికి
ద్రోహిపోలిక నేల తోచినాడ ?

గీ. తోచినాడనే ననుకొన్న, దోసిలొగ్గి
నను మునీంద్రుండు కృపతోడ గన డిదేల ?
కటకటా ! నా తల వ్రాత గాకనున్న
వేరుగా నెంచనగునె యీ ఘోర మరయ ?

నార—కాశీరాజా! గతమునకై విచారింపకుము, నీ ప్రాణ రక్షణోపాయము నే నాలోచించి వచించెదను గాన, నీ వింటి కేగుము.

యయా—మహాత్మా! నిజమేగదా?

నార—రాజా! ప్రమాదావస్థల నున్న నీతో పరిహాసము లాడుదునా? కేవలము నీయం దభిమానము చేతనేగాక— యీ మునిచంద్రు లందరు నాకు నియోగించిన కార్యభారము చేతను నేను నీకు సహాయము చేయవలసిన వాడనై తిని గాన, నా శక్తివంచన లేకుండ యత్నింతును.

వశి—నరనాయకా! శ్రీరాముండు నిను రక్షించు గాక. పోయి రమ్మా.

యయా—మునీంద్రులవారి యాశీర్వాద ప్రభావ మెటులున్నదో?

గీ. అరయ గాధేయు డాతని గురువరుండు;
ఒనరగ వశిష్టు డతని పురోహితుండు;
తొలుతనుండి నే నతని భక్తుండ నగుట
నేమి సేయునో శ్రీరాముడింక నన్ను.

నేనింక బోయి వచ్చెదను.

అందరు—విజయీభవ.

(తెర వ్రాలును)



ఓమ్

# శ్రీ రామాంజనేయ యుద్ధము

## ద్వితీయాంకము

(శ్రీరాముడు, లక్ష్మణుడు, భరతుడు, శత్రఘ్నుడు, వేరు వేరు పీఠంబు లందు గూర్చుండియుండ తెర లేచును.)

లక్ష్మణుడు—అన్నా ! సర్వసద్గుణ సంపన్నా !

ఉ. ఎన్నడులేని చింత, యిటులేటికి గల్గెను మీ మనంబు నం
దున్న విచార కారణము నొక్కపరిన్ వివరింపుమంచు మే
మిన్నివిధాల వేడిన, నొకింతయు బల్కరదేమి ధర్మమో
యన్న ! తృతీయ సోదరుల టన్న మరొక్కగతిం దలంచితే ?

శ్రీరా—అనుజులారా ! చెప్పుటకు నోరు రాకున్నదిగదా ?

భర—అంతటి దుర్విషయ మెట్టిదై యుండునోగదా ?

శత్ర—అన్నా ! మాకన్న మీకాప్తులెవరు ? అగ్రజు డనుభవించు చున్న నా విచారమును మేమును పంచుకొనుట సోదరధర్మము కాదా ?

లక్ష్మ—మీరు మనంబున వగచుచు మాతో చెప్పకయున్న దేవరవారి విచారమునకు కారణము మేమే యగుదు మేమోయనియు సందేహించు చున్నాము.

శ్రీరా—ఎంతమాట ! చెప్పుటకు నోరురాక చింతించు చుంటినే కాని, మీరు నా కపకారులనికాదు. దశరథ రాజకుమారులందట్టి బేధాభిప్రాయంబు లెన్నడును కలుగవు—కలుగనేరవు.

చ. తెల తెలవారువేళ, నరుదెంచితి, నెచ్చటికో వంచిపగా
తెలియదుకాని, ఒక దీనుని, భక్తుని కంఠమేటికో

యిలబడ నేసినట్లు కడుహేయపు స్వప్నముగంటి-నా మదిన్
కలతవహించె, నేమిచెడు కల్గునొ యంచు భయంబు దోచెడిన్.

లక్ష్మ—అగ్రజా! స్వప్నమునుగూర్చి యింత చింతింపవలయునా? మన కులగురుండును, పౌరోహితుండనగు వశిష్టభగవానుని రావించి దుష్టస్వప్నదోష పరిహారణార్థంబుగ శాంతిచేయించుదము.

భర—సౌమిత్రి యాలోచన సమంజసముగ నున్నది.

శత్రు—వశిష్టభగవానుని కొరకై యిపుడే వార్త నంపుదము.

(తెరలో)

ప్రభూ! విశ్వామిత్ర మునీంద్రులవారు విచ్చేయుచున్నారు.

శ్రీరా—తగు గౌరవ మర్యాదలతో ప్రవేశపెట్టుము.

లక్ష్మ—సమయమునకు పిలిచినట్లే విశ్వామిత్రుం డరుదెంచుటయు మంచిదియే.

శ్రీరా—ఆ మునిచంద్రులు మనకు గురుచంద్రులుగదా! దుస్స్వప్నమునకు శాంతిమార్గ ముపదేశింపకబోరు. సోదరులారా! అదుగో దయచేయుచున్నారు. ఎదురేగుదము రండు.

(నలువురు లేచి నడచుచుండ విశ్వామిత్రుడు వారికి
యెదురు దిశనుండి ప్రవేశించును.)

శ్రీరా—గురుచంద్రుల కభివాదములు.

విశ్వా—విజయసిద్ధిరస్తు.

లక్ష్మ—ఈ మణిపీఠము నలంకరింపుడు.

విశ్వా—(కూరుచుండును.)

భర—దేవరవారి రాకచే మా గృహము ధన్యంబయ్యె.

శత్రు—మీ రాక మా కాహ్లాదజనితమయ్యె.

శ్రీరా—మహాత్మా! మీకు క్షేమమేగదా?

విశ్వా—ఆఁ! మాక్షేమంబుల కేమిలే.

శ్రీరా—అటులంటిరేమి?

విశ్వా—అనకబోవుటేమి?

సీ. పర్ణశాలల లోన పడియుందుమే గాని
మేడలు మిద్దెలు మాకు లేవు;
కాషాయ పుట్టముల్ కట్టుచుంటిమే గాని
కాంచనాంబరము లా కట్ట లేము;
మానుపూసలదండ మరి వేతుమే గాని
తతరత్న హారాల దాల్ప లేము;
అడవి దుంపలనెట్లొ గుడువ నేర్తుమె గాని
దివ్య భక్ష్యంబుల దినగ లేము;

ఆ. వె. కాననముల బ్రతుకు గడుపు కొంటిమే గాని
రాజ నగరు లందు గ్రాల లేము
యిట్టి పేదవాడ నెంత గురువు నైన
గురుతు లేక బోతి కొంచె మిపుడు.

శ్రీరా—(చెవులు మూసుకొని) హరిహరీ! పాపము శాంతించును గాక. పాపము శాంతించును గాక. గురుచంద్రా! ఎంత మాటంటిరి? ఈ రాముడే నాడేనియు మిమ్ము తిరస్కరించెనే? మిమ్మే కాదు. ఎవరిమాట నేనియు నుల్లంఘించని రాముడేమి? సద్గురుమూర్తులగు మీ యాన జవదాటుటేమి? అసంభవము.

విశ్వా—రామచంద్రా! నీవు నా మాట నెన్నడును జవదాటవని నే నెరుంగుదును. ఐనను యేమందువో యని హాస్యము లాడితిని గాని వేరు గాదు. నీ వేమియు మనోవ్యాకులత నందకుము.

లక్ష్మ—దేవరవారి కృపకు పాత్రుల మైతిమి.

విశ్వా—కావచ్చును.

శ్రీరా—అనగ?

విశ్వా—మీరును నాకార్యమును పూర్తిగావించినగదా ?

శ్రీరా—పూజ్యులాతనీయుటయు, మేమాచరించక బోవుటయునా? మహాభాగా! రాముడు మా శిష్యుడుగదా ? వీనిపై మీకా సందియమేల కలగవలయును ? దేవా ! మేము బలాతి బల లభ్యసించినది మీ సన్నిధానమునకాదా ? తాటకీ సంహార మొనర్పజాలినది మీ యాశీర్వాద ప్రభావమునకాదా ? మారీచ పరాజయంబు గావించుటయు మీ యాజ్ఞా బలంబునకాదా ? హరధనుర్భంగా నంతరమున జానకిని ధర్మపత్నిగ బడయుటయు మీ కృపచేతనే కాదా ? ఇప్పటివరకు నీ యయోధ్యానగర సింహాసనంబున ధర్మపరిపాలనం బొనరించు చున్నది మీ చల్లదనంబున కాదా ? అట్టిచో, యిట్టిరాముడు మీ యభిసంధి నిరాకరించునే ? నిరాకరించు వారిని సైతము సైరించునే ?

ఉ. ఇంతకుమున్ను మీవదన మీ క్రియ నుండుట గాంచలేదు: నా
స్వాంతము విస్మయుంబొదవె సంయమిచంద్ర ! కతంబు దెల్పి మీ
చింత దొలంగు మార్గము వచింపుడు కాదనబోక వైళ మ
త్యంత ముదంబునన్ సలిపి, హాయి నొసంగెద మీకు నమ్ముడీ !

విశ్వా—రామచంద్రా ! ఇంతగ నడుగుచుంటివిగాన నికచెప్పక తప్పలేదు. నా మనంబున నిండియున్నది పరాభవ దవానలంబుగాని, మరియొకటిగాదు.

శ్రీరా—ఏమీ పరాభవమా !

లక్ష్మ—ఏమీ ? విశ్వామిత్ర మహర్షిని పరాభవించిన నా దుర్మార్గు డెవ్వడు ?

భర—ఆ దుర్మార్గు డింకను జీవించియుండెనా ?

శత్రు—మునీంద్రులవారి శాపంబునకు గురికాకున్నకదా ?

విశ్వా—నన్ను భరాభవించిన వాడా క్షణంబుననే మామక శాపానల కీలల భస్మమై యుండెడి వాడేకాని, దుష్టశిక్షణా శిష్టరక్షణా దక్షుండగు శ్రీరాముడు నా శిష్యుడై రాజ్యపాలనము చేయుచుండ దండనాధికారము నాకేలనని యుపేక్షించితిని.

శ్రీరా—మంచి పని చేసితిరి. సౌమిత్రీ! మహర్షులవారి నగౌరవ పరచిన య ద్దురాత్ము డెవడో యెరింగి, శీఘ్రంబుగ బిలుచుకొని రమ్ము. న్యాయస్థానంబున విచారణ జరుప వలయును.

విశ్వా—ఏమి, రామచంద్రా! ఆతండు నాకు చేసిన పరాభవంబు నకే నేను నా మనంబున గ్రుగ్గుచుంటిని గదా! సిగ్గు విడిచి— నీ సభలో న్యాయస్థానంబున నిలిచి — నోరు తెరచి — మరల చెప్పవలయునా? నీ వేమియో నన్ను గౌరవింతు వనుకొంటిని గాని, నా మానధనంబుల నిట్లు మంట గలుపుదు వనుకొనలేదే?

గీ. నాదు వాక్యంబులను నీవు నమ్మలేక
నలువు రుండుచోటున తీర్పు సలుప వలెనె?
గాధిసుతుని సిద్ధాంతంబు కాదనంగ
పెద్ద వైతివే వేటికీ సుద్దులాడ.

అందులకే ముందు నే నంతగ సందేహించితిని.

శ్రీరా—దేవా! అజ్ఞానిని, మన్నింపుడు. తమ నెలవైనచో నాతని విచారణ లేకయే దండించును. ఆజ్ఞ యొసంగుడు.

విశ్వా—సత్యమా?

శ్రీరా—ముమ్మాటికిని.

విశ్వా—ఐన వినుము.

మ. పరివారిన్ నగుబాటుగా; తొలి నమస్కారంబు గావించెనా
కరయన్ వైరి వశిష్టు పాదములకున్; హా! ఎట్టి నిర్లక్ష్యమో
నెరపెన్ పిమ్మట నాకు వందనము తా నిర్భీతి; మౌనీంద్రు లం
దరిలో నా కవమానమై, యితరులాత్మన్ చుల్కనల్ వేయరే?

లక్ష్మ—వధ్యు డొనరించిన నేరమునే దెలిపితిరి, కాని వాని యూరుం బేరుల తెలుపరైతి రేమి?

విశ్వా—తెలుపుటకేమి, తెలుపుదును. తెలిపిన పిమ్మట "నాతం డట్టివాడు కాడనియు, లేక అతండు మా కాప్తుడనియు; కాక, యీనేరము దండనార్హముగ మే మంగీకరింపమ"నియు సమాధానము లివ్వరుగదా ?

శ్రీరా—మహనీయా ! నేరమునుగురించి విచారణయే లేదని యింతకుముందే వచించితినిగదా ? అయ్యది పాపంబైనను, పుణ్యమైనను దేవరవారి యాన పాలించుటయే నా కర్తవ్యము. ఇక దండనార్హునిగురించి యందురా ?

చ. అరయగ మద్గురూత్తమున కంత విరోధము గూర్చినట్టి యా
దురితుడు బంధువైనను, హితుండయినన్ నరుడైన, దైత్య భూ
వరు డగుగాక నాకపురి పాలకుడైన మరెవ్వరైన నే
నరికెద వానిశీర్షమిక నమ్ముడు దేవరపాద సాక్షిగా.

విశ్వా—శెహభాష్ ! రామచంద్రా ! ఇంక నా సందియము దీరి పోయినది. ఇపుడు చెప్పుచున్నాను వినుము. నన్ను పరాభవించినవాడు కాశీనగరాధీశుడైన యయాతి మహారాజు.

శ్రీరా—(ఆశ్చర్యముగ) ఆఁ ! యయాతియా !

విశ్వా—ఔను. యయాతియే.

లక్ష్మ—నిరంతర రామనామస్మరణా పరతంత్రుడగు యయాతియే యిట్టి శిక్ష కర్హుడా, దేవా ?

భర—కలనైన నపచారముచేయని కాశీరాజా గాధేయున కపచారంబు గావించినవాడు.

శత్రు—మునిచందులవారు రోషాయత్త చిత్తంబున తొందరబడి యయాతిపేరు దెల్పుటలేదుగదా ?

విశ్వా—లేదు శత్రుఘ్నా ! లేదు. నేనేమియు తొందరపడుట లేదు. మీ యన్న పొరబడి సూనృతదూరుడు కాకుండ చూచుకొమ్ము.

శ్రీరా—హా ! యయాతీ ! ఎట్టి దురద్ధ ఘటించినది ? నీవేనా యీ మహనీయుని యెడల దొసగొనరించినది ?

సీ. పాణి గ్రహించిన పద్మనేత్రిని వీడి
కలనైన పరకాంత దలపబోవు;
పరిహాసములకైని పరమసత్యము గాక
యిచ్చకంబుల వచియింపబోవు;
పొరబడియైనను పరహితంబును బాసి
చేటు నెవ్వారికి చేయబోవు;
అనవరతము గురుధ్యానంము లిడనాడి
దురిత కృత్యంబుల కరుగబోవు;

గీ. సతము నానామపఠనంబు స్వాంతమందు
మరువబోవు, మరొకలీల మసలబోవు;
యిట్టి నిను జంప నాచేతులెట్లు లొప్పు?
చంపకున్న వాగ్దానంబు జరుగు టెట్లు?

లక్ష్మ—అకటా! కాలమహిమ!

ఉ. రాముడు. దుష్టరాక్షస విరాము జటంచును నేటిదాక శ్రీ
రాముడు కీర్తిగాంచెను; ధరాతలమందున నిప్పుడిట్టి లీ
సీమముబాసి భక్తవరునిన్ వధియించిన కీర్తిగూడ, రా
నేమొ యయాతికట్టి మృతినీగతి ధాతలిఖించె వింతగన్.

భర—అవురా! నేడెంతటి దుర్దినము? సంకట మెరుంగని రాముని చిత్తమెట్టి ధర్మసందేహంబుల బాలయ్యె

గీ. గురుడు. గాధేయుడన్న ముక్కోపిగాన
వానికిచ్చిన మాట దీర్పంగవలయు;
పుణ్యుడైన యయాతిని బ్రోవ వలయు
రెండు కార్యంబు లెటు లాచరింప గలము?

శత్రు—ఆహా! పరమ పవిత్రుడైన రామభద్రునిచే నెట్టి కార్యంబులను చేయించు చుంటివి దేవా!

గీ. కల్లు ద్రాగిన చాకలి కైపు కూత
లరసి జానకి నడవుల కనిపెనాడు;

నేడు ముక్కోపితో యెదురాడలేక
రామడు యయాతిని వధింప గ్రాలె నౌర!

శ్రీరా—మహాత్మా! యయాతిని మన్నించు మార్గము లేదా?

విశ్వా—ఏమి? నీ వాతని వధించ లేవా?

శ్రీరా—భక్తుని శిరచ్ఛేదనము బాధాకరము గాదా?

విశ్వా—అటులైన గురు శాసనోల్లంఘనయేనా సుఖప్రదము— ఆడి తప్పుటయేనా న్యాయమార్గము?—

శ్రీరా—న్యాయమని నే నంటినా?

విశ్వా—కాక, గాధేయ వంచకుని ఖండింతు నంటివా?

శ్రీరా—గురుచంద్రులు శాంతింపకున్న... ....

విశ్వా—రామచంద్రుడు నిజము పాలించినచో గురుచంద్రులు శాంతింప కుందురా?

శ్రీరా—పూజ్యు లిట్లు ప్రశ్నించిన నేను బదులాడగలనా?

విశ్వా—రామా! నీ వడిగిన దానికి సమాధానము చెప్పక నోరు మూసుకొని తల నాడించినచో బదులాడ గలుగుదువా? అడుగ దగిన మాట, అడుగ దగిన సమయమున నడిగినచో బదులాడ లేకపోవుదువా? పోనిమ్ము. నీ కంత కష్టమైన "యేదో మాట వరుసగ మీ యాన నొనర్తునంటినేగాని, నిజముగాద"ని చెప్పుము. నీకు నీ గురు తిరస్కారము కంటె, నను తిరస్కరించిన వాని శిరచ్ఛేదన మంత కష్టతరమునైన నేనేల బాధింప వలయును? నీవేల బాధపడ వలయును?

శ్రీరా—గాధి రాజనందనా! దశరథనంద నుండెన్నడేనియు నాడి తప్పునే?

చ. వననిధు లింకుగాక, రవి పశ్చిమ దిక్కుననుండి తా జనిం
చినను జనించుగాక; భువి శీఘ్రమె క్రుంగునుగాక, తార లీ
క్షణమున రాలుగాక, కులశైలము లేడును బ్రద్దలై ధరి
త్రిని బడుగాక, రాముడు చరింప డసత్య పథంబు నందునన్.

మునివరేణ్యా !

గీ. దయయు దాక్షిణ్యముగల భూధవుడ నగుట
భక్తుడగు యయాతిని జంప పాపమగుట
యించు కించుకనేమొ శంకించినాడ
నింతమాత్రాన నిందింప నేలనయ్య ?

విశ్వా—ఓరీ ! కపట వినయ గుణశీలా ! చదువు నేర్పిన గురువునకే చక్కటులు చెప్పుచుంటివిరా ? నీ వంతటి దయాదాక్షిణ్యము గలిగిన ధర్మప్రభువు వైనచో నేనంత కిరాతక స్వభావుండననియా నీ యభిప్రాయము ? "చెప్పినపని చేసెదనని చెయ్యరాని ప్రమాణంబులుచేసి; చెప్పినతోడనే చేయలేక చేతులు వెల్లికల వైచిన నీ వించుక యోచించు చుంటివా ? చేతగాకున్న చేయలేనని చెప్పుము. వెడలి పోయెదనని నేననుట నిందించుటయా ? రాఘవా ? ఈ విరుద్ధ న్యాయచట్టంబులు నీ పాలనయందేనా ? మున్నెన్నడైన నున్నావా ?

శ్రీరా—సంయమీంద్రా ! మన్నింపుడు. యయాతి వధ నాకు తప్పనిసరియేకదా ?

విశ్వా—అని నేనన వలయునా ?

శ్రీరా—అక్కరలేదు. ఎవరేమియు నననక్కరలేదు.

చ. పనివడి బంధుమిత్ర పరివారములందరు కాదటంచు బ
ల్కిన, పురవైరి యుద్ధమొనరింపగ వచ్చిన; యెవ్వరే విధం
బు నడిచినన్, సహోదరులు పూరితిగా వ్యతిరేకించిపోయి. యా
యనిలసుతుం డెదిర్చిన యయాతిని జంపక వీడ నింకపై.

విశ్వా—తథాస్తు. రామచంద్రా ! నేనింక బోయివచ్చెదను, నీపని నీవు గావించుకొనుము.

(నిష్క్రమించును.)

లక్ష్మ—అకటా ! ఈ మునీంద్రు డెంతటి పట్టుబట్టినాడు !

భర—ఇంతకు నీ గండము గడచుటెట్లు ?

శత్రు—ఒకమేలు చూచిన నింకొక కీ డొదవుచున్నదిగదా ?

శ్రీరా—సోదరులారా ! విచారించి యేమిచేయగలము ?

లక్ష్మ—ఎటుచూచినను పర్యవసానము దోచుటలేదుగదా ?

గీ. పరమ భక్తుని జంపంగ పాడిగాదు;
గురుని యాన నుల్లంఘింప పరువుగాదు;
ఒకటి ధర్మంబునైన వేరొక టధర్మ
మిట్టి యిక్కట్టు లందు గట్టెక్కు టెట్లు ?

భర—ఎప్పటికేస్థితి వాటిల్లునో యెవ రెరుంగుదురు ?

ఉ. వేటకతంబునన్ వనికి వేజనుదెంచు యయాతి బుద్ధి నీ
పాటు దలంచెనే ? గురుడు వచ్చెనటన్న ముదంబునందు పో
రాట మటంచు నెంచితిమె ? రాగల దుర్దిన మిట్లురాగ నిం
కేటికి చింతిలంగ ? నిపుడెయ్యది మార్గమెరుంగ బల్కుడీ !

శత్రు—ఇందొకరు మార్గమెరిగించువారు, మరొకరు వినువారునా? అందరి మనంబులును గుందుచుండ నెవరేమి చెప్పగలదు ? అగ్రజుండును, కుశాగ్రబుద్ధియు, సర్వకార్య నిర్వహణ దీక్షా దక్షుండు నగు శ్రీరాముడే కర్తవ్యమును నిర్ణయించిప జాలినవాడు.

శ్రీరా—అనుజులారా ; ఇది యంతయు నేను గాంచిన దుస్వప్న ఫలము.

లక్ష్మ—ఔనౌను. కౌశికుని రాక మన కానంద దాయక మను కొంటిమి గాని, మిగుల విషాద హేతువైనది.

భర—ఆత డూరక వచ్చునా ?

శత్రు—వీని మూలంబున నందరకును కష్టంబులే కదా ?

శ్రీరా—మీరు పొరబడుచున్నారు. కష్టకాలంబు లందు ధైర్యంబు లేని వా రిటులే పరులను నిందించు చుందురు. తమ్ములారా ! గాధేయుని రాక ప్రమాద కారణమే కావి ప్రమోద దాయికంబు కాదని భావించుట

మన యమాయకత్వము కాదా? విశ్వామిత్రుని వలన మనము మాత్రము మేలు బడయలేదా?

సీ. అద్భుతమైన బలాతి బలల నేర్వ
జాలితి మాతని చలువ గాదె?
బలవంతులగు దానవశ్రేణిని వధించి
కీర్తిలు టాతని కృపను గాదె?
రాతియై బడియున్న నాతికి నిజరూపు
కలిగించు టాతని కరుణ గాదె?
శివచాపము ద్రుంచి సీతను పెళ్ళాడి
యిలుజేరు టాతని వలన గాదె?

గీ. పిలిచి పిల్లల నిప్పించి బెండ్లిచేసి
మీకు ముదమిచ్చు టాతని మేలు గాదె?
ఆతని కతన నెంతయొ ఖ్యాతి వెలిగె,
నింతలో నిటులాడని దేటికయ్య?

శత్రు—అన్నా! క్షమింపుము. తెలియక దేవరవారి గురూత్తములైన విశ్వామిత్రుని నిందించుటయే గాక భాతృదేవులగు మీ హృదయంబునకు గూడ చీకు గలిగించితిని.

శ్రీరా—దానికేమి, వత్సా! పశ్చాత్తాపము పాపహరణముగదా?

లక్ష్మ—ఐన మనమింక చేయగలిగిన దేమి?

భర—యయాతీ సంహారమే.

శ్రీరా—ఔను. సోదరులారా! మన మొకవేళ యయాతిని రక్షింపబూనినను వానిని కాపాడలేము.

శత్రు—ఏల?

శ్రీరా—విశ్వామిత్రుడు మహాకోపి. పట్టినపట్టు విడిచిపెట్టువాడు కాదు. మన మా కాశీనాయకుని చంపకున్నచో నాత డే శాపంబున వానిని బూదిచేయక మానడు.

లక్ష్మ—అంతియేనా ? నాయాన మీరితిరని క్రోధావేశంబున మనల గూడ శపింపగలడు.

భర—కటకటా !

శ్రీరా—ఆ శాపంబు నాయొక్కనిపై ప్రయోగించిన నే నానందింతును. ఇప్పటికే వైదేహినివీడి విచారమున నుంటినిగదా ?

గీ. మొదలె సీతావియోగాన మునిగియున్న
నాకు మరణమే సౌఖ్యంబు న్యాయమరయ
అందు మునిపావనానల లందు భస్మ
మగుటకన్నను వేరు పుణ్యంబుగలదె ?

కాని, యీ దీర్ఘకోపి మనవంశంబునంతయు శపించినచో నా మూలమున వంశనాశనమే కాగలదు.

గీ. ఒకని ప్రాణరక్షణనెంచి, యోమలేక
కులమునెల్ల హతముచేసుకొందునేమొ ?
గాన కీడుమేలులజూచి వానినిపుడు
పట్టి చంపుటయే ధర్మపథమునాకు.

లక్ష్మణా ! నీ విదే వారణాసికేగి నా యయాతిని పట్టితెమ్ము.

లక్ష్మ—అయ్యయో! చివరకీపనిగూడ నాచేతుల తోడనే చేయించుచుంటివా రామచంద్రా!

గీ. మాన్యురాలైన జానకీ మాతనపుడు
వెంటగొనిపోయి వనిలోన విడిచినాడ;
పరమభక్తుడైన యయాతి ప్రభువు నిపుడు
పట్టి మృతికప్పగింపగా వలసినాడ.

శ్రీరా—సౌమిత్రీ ! ఇందు విశేష మేమున్నది ? ఏ పని చేసినను తొలుతనుండి మన మిరువురమే గదా ?

సీ. తండ్రి యానతిగాంచి, తాటకిని వధించి
గాధేయ యాగంబు గాచునాడు;
వాలిని దెగటార్చి వనర సుగ్రీవుని
సింహాసనమునందు జేర్చునాడు;
హరుని విల్లువిరిచి, వరుసతోడ జనక
జాత్మజల వివాహమాడునాడు;
వనవాస మరుదెంచి వారధి బంధించి
దుష్ట దానవకోటి దునుమునాడు;

గీ. వీడిపోక నిర్వ్వరమునుగూడి మున్ను
కార్యములనెన్నొ సమకూర్ప గలిగినట్లె;
ఆ యయాతీంద్రు ప్రాణాప హరణగూడ
వేగ నిర్వ్వరమింక గావింపవలయు.

కావున నింక మీరందరు మీమీ నివాసంబులకు బొండు. నేటికి సభ చాలింతము.



ఓమ్

# శ్రీ రామాంజనేయ యుద్ధము

## తృతీయాంకము

(కాశీపురమున; యయాతి, శాంతిమతి ప్రవేశము)

యయాతి—అమాయకులారా ! ఇంకెక్కడి ధైర్యము ?

మ. ఎపుడా గాధిసుతుండు పగ నన్నీరీతి భాషించెనో,
అపుడే జీవితనౌక దుఃఖనిధి మధ్యంబందునన్ మున్గె; నన్
గృపగావంగల వాడెవండు ? మునికిం గీడెంచి జీవింపనే
నృపుడేనిన్ దగువాడె చెప్పు మబలా ! నిక్కంబు యోచించినన్,

కావున నదియంతయు నా విధి విలాసము. ఎవరెంత చింతించినను చేయునదిలేదు. ఎందులకు నాకీ యడియాశ ?

గీ. మునుల సందర్శనముచేయు పుణ్యమునను
యిడుమ లుడిగి మేలందుదు రెంతొమంది;
అట్టి సత్కృప కాలయంబైన ఋషుల
సముఖమందె మృత్యువు నాకు సంభవించె.

లోక ధర్మంబునకు విరుద్ధంబుగ జరిగిన యీ దుస్సంఘటన మాఱునదికాదు.

శాంతి—నాధా ! మీ రటు లధైర్యమందకుడు. నా మాంగల్య ప్రభావంబున మీకీ ప్రమాదంబు తప్పగలదు. ఐనను కోపతాపముచే బల్కిన విశ్వామిత్రు డంత పగ వహించునా ? పగ వహించుటకు మన మాతనికి చేసిన దోషమేమున్నది ?

యయా—ఆతనిని విడిచి ముందుగ వసిష్ఠ భగవానునికి నమస్కరించుటయే నే నొనరించిన మహానేరము.

శాంతి—అది వారికి వారికి గల పూర్వవైరకారణము గాని, మీ యందలి ద్వేషము కాదు. ముక్కోపి యగు నాముని నాధుం డా సమయంబున నాగ్రహించిన నాగ్రహించును గాక, తదుపరియైనను నిదానించి యోచించి నిజము గ్రహింప కుండునా ?

యయా—శాంతా ! ఇది యంతయు నీ యమాయకత్వము. ప్రథమ కోపంబున నన్ను చంపిన పిమ్మట తా నా నిజమెరింగియేమి ? ఎరుంగకున్ననేమి ? ఆదియునుం గాక గాధేయుడు మొండిపట్టుదల గల వాడు. ఆతనికి యుక్తాయుక్తవిచక్షణ లేదు. న్యాయాన్యాయ విమర్శన వాని హృదయంబుననే యుండదు.

గీ. ఏమి యెగ్గొనరించె నంచెంచి నాడు
చని హరిశ్చంద్రు నారీతి సలుప వలనె ?
కన; వశిష్టునిపై పగ కారణమున
నాకు గూడ ఘటించె వినాశనంబు.

శాంతి—ఆర్యపుత్రా ! విశ్వామిత్రు డట్లు రోషంబు నొందుచుండ నందున్న వారెవరు "ఇది న్యాయ విరుద్ధం" బని మందలింపనే లేదా ?

యయా—మందలించి మాత్రమేమి ప్రయోజనము ?

గీ. నీతి నీమంబు గలుగువాని కెవరేని
చెప్పనేర్తురు పొరపాటు చేయువేళ;
మంచి నెంచలేని దురభిమాని కెవడు
చెప్పచూచు, తిరిగి తమ చేటుగాగ.

ఐనను మిన్నకుండిరా ? వశిష్ఠ, గౌతమ, జాబాలి నారదాదులు వానిని శాంతింప జేయచూచిరి కాని; ప్రయోజనము లేకపోయినది. ప్రయోజనము లేకపోయినను నాకంతగ విచారము లేదు కాని, పాపము నన్ను కాపాడనెంచిన వారుగూడ నగుబాటుపాలైనందులకు చింతించుచున్నాను.

శాంతి—ఔను. మూర్ఖులకు చెప్పు సదుపదేశంబువలన ముప్పు వచ్చునుగదా ?

గీ॥ పామునకు పాలుఁబోసిన పగిదిగాగ
మూఢులకు హితంబువచింప ముప్పుదెచ్చు
గాధిసూతికి నీతులు గరుపబోయి
కడమయుషు లవమానంబు గాంచిరకట.

ఇంతకు మన కర్తవ్యమేమి ?

యయా—ఇంకను కర్తవ్య మరయవలయునా ?

మ. పులినోటన్ బడు మేక చందమున నా పున్నెంబు భంగంబునై
యిల గాధేయుని కోప వీక్షణములందే చిక్కియున్నాడనో
లలనా ! యెక్కడి జీవితాశ ? యికలోలత్వంబు బోనాడి ని
శ్చల చిత్తంబున దైవమున్ గొలువ మోక్షంబేని చేకూరదే ?

శాంతి—(చెవులు మూసుకొని) అమంగళము ప్రతిహతమగుగాక. అమంగళము ప్రతిహతమగుగాక. నాధా ! నాకొక రూపంబున ధైర్య మొదవుచున్నది.

యయా—ఏదది ?

శాంతి—మీరు శ్రీరామచంద్రుని భక్తులుకదా ?

యయా—నేను శ్రీరామభక్తుండనైన, నా విశ్వామిత్రుండు శ్రీరాముని గురువుకాదా ?

శాంతి—కావచ్చును. రఘురాముండు నీతిపాలనా దురంధరుడు గదా ?

యయా—గురువుల నెదిరించుట నీతివిరుద్ధంబుగాదా ?

శాంతి—ఆ కారణంబున సీతాకళత్రుడు నిరపరాధుల దండించ సమకట్టునా ?

యయా—ఏది యెట్లైనను రాముని శరణు జొచ్చుట ప్రమాద కరము. నారదు డా సమయంబున మునిని వారింపకున్నచో నాకీ విచారము లేకుండ నీ పాటికి స్వర్గ మలంకరించి యుండెడివారను.

శాంతి—ఆఁ! అన్నట్టు లడుగమరచితిని. నారదుండు మీ కేదియో రక్షణోపాయము నెరింగింతునని వాగ్దాన మొనర్చిరంటిరిగదా? ఇంతవరకు రాదేమి చెపుమా!

(తెరలో)

మహారాజా! అయోధ్యనుండి లక్ష్మణుడు వచ్చియున్నాడు.

యయా—(ఆశతో) ఏమి? లక్ష్మణుడా? అయోధ్యనుండియా? ఎంతటి యదృష్టము? (తెరలోనికి చూచి) సేవకా! శ్రీరామానుజుల వారిని గౌరవయుతంబుగ ప్రవేశపెట్టుము. (శాంతిమతితో) దేవీ! ఏమి, యీ వైపరీత్యము? నా వామనేత్ర మిట్లదరుచున్నది?

శాంతి—నాకును మనంబున భీతితోచుచున్నది నాథా! ఆపద్బాంధవుండగు రాముని తమ్ముడు లక్ష్మణుడు వచ్చెనన్న స్వాంతమున సంతసము గలుగకుండ శకునము విరుద్ధమును సూచించుచున్నది.

(లక్ష్మణుడు ప్రవేశము)

శాంతి—లక్ష్మణ కుమారుల కభివాదములు.

లక్ష్మ—విజయ సిద్ధిరస్తు.

యయా—అయ్యా మీ రాకవలన మా గృహంబు పావనమైనది. దయచేసి యీ కనకపీఠ మలంకరింపుడు.

లక్ష్మ—(మారాడక కూర్చుండును.)

యయా—ప్రభూ! మీ ముఖపద్మమిట్లు చింతామయమై యున్నదేమి?

ఉ. రామ నృపాలు డారయ పరాత్పరుడై ధరనేయుచున్న సు
శ్రీమయ రాజమం దెపుడు చెన్నలరారెడు మీకు చింతయే?
వేమమె మీరలెల్లరు? వసింతురె హాయిగ మీ ప్రజల్? యిటుల్
నీ మది నింత చింతపడ నిక్కపు కారణమేమి దెల్పుమా!

లక్ష్మ—(తలవంచి) శ్రీరామ చరణారవింద సేవాదురంధరా శ్రితజనమందారా ! ఏమని చెప్పుదురు ?

శాంతి—(స్వగతమున) ఏమి చెప్పుదునని సందేహించున్నాడే !

యయా—ఏమీ ? మీకును గూడ విచారమా ?

లక్ష్మ—కాదా మరి ? యయాతీ ! సుగుణజ్యోతి !

సీ. నిఖిల కోసలభూమి నిరసించి కానల
గడుపుచో నీ చింత గాంచలేదు;
మా తండ్రి దశరధ మనుజాధినాధుండు
గతియింప నీ చింత గాంచలేదు;
జానకి లంకలో చరయందు వశియించు
కష్టాల నీ చింత గాంచలేదు;
మోహరంబున నేను మూర్చిలి బడియున్న
కాలాన నీ చింత గాంచలేదు;

గీ. మరల నిందకై జంకుచు మైధిలి నటు
కాన కనుపుచో నీ చింత గాంచలేదు,
కాని యీనాడు యొక చిన్న కారణమున
కటకటా ! రాము డిల చింత గాంచెనయ్యా !

యయా—ఏమీ ? సహజగంభీర హృదయుండును; రణరంగ ప్రచండ కోదండ పాణియు; దుష్టరాక్షస విరాముడగు నా శ్రీరామునకు గూడ చింతాక్రాంతంబగు నా విషయమెట్టిదియో గదా !

లక్ష్మ—కాశీనగరాధీశా ! విధి బలవత్తరము. దానిని దప్పుకొన నేరికి తరమగును ?

యయా—ఔను. ఆ విషయంబు నాకు స్వానుభవంబుననే యున్నది. కాని మహాత్మా ! మాటలసందడిలో దేవరవారి రాకకుంగల కారణ మారయనైతిని, మన్నింపుము.

కం. మీరిట కరుదెంచితి రే
కారణమున నాకు దెల్పి కౌతుకమిమ్మా!
శ్రీరామభక్తుండ నగుట
వేరు వచింపక నొనర్తు వేగముతోడన్.

లక్ష్మ—యయాతీ! ఇంతదూరము వచ్చినవాడను, వచ్చిన పనిని వెలిబుచ్చకయె బోవుదునా? అటులు పోయినచో నీవును నేనును శ్రీరామచంద్రుని యాన నిరసించినవారమే కదా?

యయా—అటులేల కావలయును ప్రభూ! ప్రత్యక్షదైవంబగు నా కళ్యాణరాముని యాన సిరసాధరింతునుగాని, తిరస్కరింతునా?

లక్ష్మ—నిన్ను గొనిరమ్మని రఘురాముడు నన్నంపినాడు.

యయా—(ఆశ్చర్యమున) ఏమి? శ్రీరాముడు నన్ను రమ్మని నాడా? నారాముడు నన్ను రమ్మనినాడా? ఆహా! ఏమీ నా భాగ్యము? ఎన్నాళ్ళకా జానకీరాముని కరుణాకటాక్ష వీక్షణ ప్రాప్తి?

శాంతి—అయ్యా! మేమొక విపత్సముద్రమున మునింగియుంటిమి. ఆ యాపదనుండి రక్షింప శ్రీరామప్రభువును శరణుగోరు తలంపున వారు రాదలంచుచుండ మీరే వచ్చితిరి. ఇంక మాకేమి కావయును? శ్రీరామరక్ష నా మాంగల్యమును కాపాడుగాక.

లక్ష్మ—అకటా! ఈ యమాయకురాలు మా వలన శుభంబు గల్గునని సంతసించుచున్నదిగదా? శరణాగతరక్షణ బిరుదాంకితుడని వీరు నమ్మికొన్న రాముడే శిరము నరుకబూనె ననుమాటవిన్న నీ దంపతులేమయ్యెదరో? వీరికా కర్ణ కఠోరవార్త నెట్లు వివరించును?

మ. నను వీక్షించిన యంతచిత్తమున ప్రాణరక్షకుండంచు నెంచిన యీ దంపతు లెట్లు నా పలుకులన్ చింతింతురోయంచు నా
మనమందక్కట! శంకగల్గె; తరుణీమాంగల్యమున్ గావలే
మన మిన్నన్ మరిముట్టకుండు నొకొ హాహాకారముల్ గ్రమ్మరన్.

(ప్రకాశముగ) అమ్మా! శాంతిమతీ! నీ మాటలు నా కర్థమగుట లేదు. విశదీకరింపుము.

యయా—విశదీకరించుట కేమున్నది. ప్రభూ! ఒక స్వల్ప కారణంబున కౌశికుండు ననుజంప బ్రతిననూనె.

లక్ష్మ—(స్వగతము) అయ్యో! పాపిష్ఠి హృదయమా! ఇంకను వ్రయ్యలు గాకుంటివేమి? కట్టడిదైవమా! ఇదెక్కడి విషమపరీక్ష దెచ్చి పెట్టితివయ్యా!

చ. విడువక రామనామము జపించెడు భక్తుడు, గాధిసూతికిం
జడిసినవాడు, రాఘవుని సాయము గోరదలంచి యీ విధిన్
నుడువుచునుండె, నేగతి, నినున్ వధియింపగ నుంటిమంచు నీ
ఘడియ వచించువాడ? నిది కాగలకార్యమె రామదూతకున్?

ఐనను చెప్పక చేయునదేమున్నది? (ప్రకారముగ) అమ్మా! శాంతిమతీ! శ్రీరాము డీనాడు మీకే యుపకారమును చేయజాలనివాడై యున్నాడు. అందువలననే వానికీ విచారము సంభవించినది.

యయా—(ఆశ్చర్యముగ) ఆదేమి మహానుభావా! ఆటులంటి రేమి! శ్రీరామచంద్రునకు నా మూలమున విచారమా?

లక్ష్మ—ఔను.

శాంతి— అదెటులు?

లక్ష్మ—గాధేయుండు నీకడనుండి పయనంబై కోసలకుం జనుదెంచి రామునితో నీ యూరుంబేరుల, నేరమును ముందుగ దెలుపక; తన్నొక దుర్మార్గుం డవమాన పరచెననియు, వాని వధింప వలయుననియు దెలిపె.

శాంతి—అన్నన్నా! ఎంత పని జరిగినది?

లక్ష్మ—మునిజనంబుల నవమాన పరచెనన్న; యే దనుజాధముడో యను, దలంపున మా యన్న తొందరబడి, గురువరుండగు గాధేయుని యాన మీరనేరక "మహానుభావా! అత దెవండైనను పట్టి వధించెద" నని దివాకర నిశాకర సాక్షిగ శపథం బొనరించె.

యయా—(భయంబున) హరిహరీ! ఇంకేమి చేయుదును?

శాంతి—తరువాత ! తరువాత !

లక్ష్మ—చేయునదిలేక చింతించితిమి. ఈ తప్పు సైరించు మని గాధేయుని ప్రార్థించితిమి. కాని ప్రయోజనము లేకపోయినది.

యయా—ఇంతకు నా కాయుష్యము పూర్తియైనపు డెవరేమి చేయగలరు ?

శాంతి—అయ్యో ! పాలకుడే మా పాలిట కాలు డయ్యెనా ? అయ్యా ! సౌమిత్రీ ! నా నాధుండు మీకేమి యపకార మొనరించినాడని యీ నిష్కారణ మారణదండన విధించు చున్నారు ?

సీ. శత్రుపైనను గాని శరణు గోరిన వేళ
 ననుకంప మీరంగ నాదరించు;
అపరూప సుందరియైన, సానియు నైన
 మాతృ భావముతోడ మసలుచుండు;
పరిహాసముకేని పొరపాటు లేకుండ
 సత్య వాక్పాలన జరుపుచుండు;
కష్ట సుఖములందు కడు భక్తి శ్రద్ధల
 పెద్దలనెల్ల సేవించు చుండు;
గీ. అట్టి సద్గుణ లోలుండు, నమర పాద
పద్మసేవాదురంధర వర్యుడైన
నాదు జీవితేశుని జంప న్యాయమగునె ?
పుణ్యమయులార ! దశరథ పుత్రులార !

లక్ష్మ—అమ్మా ! నీ నాధుని దెగవేయుట న్యాయమని యెవరనిరి? కర్మవశముమీర నెవరితరము ?

శాంతి—ఏమేమి ? అందులకై శ్రీరామనరపాలుడు ధర్మవిరుద్ధంబున చరించునా ? నా మాంగల్యము గంగపాలు కావలయునా ? నా ప్రాణ విభుని ప్రాణంబు లా విశ్వామిత్ర మహాముని నిష్కారణాగ్రహ మహా మారిముందు బలికావలసినదేనా ?

లక్ష్మ—అమ్మా! తొందర నొందకుము. రాముడెపుడు లోక కళ్యాణంబునకే యత్నించువాడు—ధర్మపాలనాభిలాషి.

శాంతి—ధర్మప్రభువులు నిర్దోషిని వధింపబూనిన కారణము ?

లక్ష్మ—ఆడినమాట తప్పలేక—

శాంతి—ఐనచో నిరపరాధిని చంపుటయు దోషమేకదా ?

లక్ష్మ—నిశ్చయముగ.

శాంతి—నా నాధునిచంపి నిర్దోషిని వధించిన పాపమును మూట గట్టుకొనుటకంటె, విశ్వామిత్రుని నిరాకరించి యనృతమాడిన పాపమునే భరింపరాదా ? మీ కెటులేనియు నొకదోషంబు తప్పదుగదా ? అట్టియెడ నొక పాతకముతోబాటు నొక ప్రాణిని కాపాడిన పుణ్యంబు చేకూరుచుండ నా ప్రాణపతి నేల కాపాడరాదు ?

లక్ష్మ— తల్లీ ! నీ సందేశము సమ్మతింపదగినదె. కాని రామచంద్రుండీ యయాతిని కాపాడనెంచినను గాధేయుండు శాపమొసంగిన ప్రయోజనములేదు. అతండు మరింత కోపించినచో యయాతినేగాక మమ్ములను, మిమ్ములను, మీదుమిక్కిలి కాశీ, యయోధ్యలనుగూడ భస్మంబు గావింపగలరను సందియంబున, గత్యంతరములేక యయాతి శిరచ్ఛేదన కంగీకరించితిమి.

యయా—తండ్రీ! లక్ష్మణకుమారా ! నీ సమాధానము న్యాయసమ్మతముగ నున్నది. నా యొక్కనికై జగత్ప్రళయంబు జరుగరాదు. నేనే మరణింతునేని లోకము సుఖము నందగలదు.

గీ. ప్రజల క్షేమంబు మదిగోరి ప్రభువరుండు
ప్రాణములనైన నర్పింప పాడి యంద్రు;
నాదు మరణంబున ప్రజలు మోదమందు
మరియు రామచంద్రునకును మాటదక్కు

కావున నేనే మరణంబునకు సిద్ధమైతిని. లక్ష్మణా ! లెమ్ము, పోవుదము. తడవైనచో రాము దన్యధా భావించునేమొ ?

శాంతి—హాదైవమా! ఇదియేమి విపరీతము?

సీ. భూసుర సుర గురుమూర్తులు దెల్పిన
సద్వ్రతములనెల్ల సలిపినాను;
ఆలయ, తీర్థ పుణ్య ప్రదేశంబుల
పలుమారు సేవించి వచ్చినాను;
సాధు, సజ్జన, దేవ చరణార విందముల్
వీడక భక్తి సేవించినాను;
ధన, కనక, వస్త్ర, ధాన్య దానాదుల
చేతులార సతము చేసినాను;

గీ. భృత్య బృదంబునేనియు బిడ్డలట్లు
కనికరంబుతోడుత చూచిగాచినాను;
నాదు పుణ్యమంతయు నేటిఖేదమునకు
కారణంబయ్యెనేమి నిష్కారణముగ.

యయా—దేవీ! విలపించి యేమి ప్రయోజనము? ఏడ్చి యేడ్చి శుష్కించుటకంటె చేయునదిలేదు. కర్మవశముమీర తరముగాదు. ధైర్యమును వహించి ముందు కర్తవ్యము లాలోచించుకొనుము.

సీ. ఏనా డెవరికేమి యెగ్గొనరించితో
యీనాటి కీగతి యిట్టులయ్యె?
ఏదంపతుల కెప్పు డెడపాటు చేసితో
యీవియోగము మన కిట్టులయ్యె?
యేపాప మెపుడేరికేను గావించితో
యీ మరణంబు కిట్టులయ్యె?
యెవరిపై దాక్షిణ్య మేను బోనాడితో
యీ ఘోరశిక్ష నాకిట్టులయ్యె;

గీ. పూర్వజన్మ కృతఫలంబు పోల్పలేక
నొకరి నిందింపవచ్చునే యుత్పలాక్షి!
మననొసటివ్రాలు సర్వంబు మనకెగాక
నన్య లనుభవింతురె యిసుమంతయైన

ఐనను మరొకందులకు మాత్రము మనము సంతసింపవచ్చును.

ఉ. కాయమునందు రుగ్మతలు గల్గియొ ? మంచము బట్టియో ? అభి
ప్రాయములేని దానవుల వాతనొ ? క్రూరమృగాళి నోటనో ?
ఆయువు బాయకన్ దశరథాత్మజు చేతి శరాన చచ్చుటే
శ్రేయము-ముక్తిధామము-ప్రసిద్ధనీయము-కామనీయమౌ.

శాంతి—కటకటా ! చివరి కెట్టిదుస్థితి గల్గినది ?

ఉ. ఇంతటి పుణ్యకార్యముల నేనొనరించితిగాన, నింక నా
కెంతటి భాగ్యమో ననుచు నెంచుచు నుంటిని నేటిదాక, నా
కాంతుని గోలుపోయి కలకాలము దుఃఖము నొందుట్రాత నా
వంతని యెంచలేదు పొరపాటుననైన నిజంబుదైవమా !

యయా—వెఱ్ఱిదానా ! ఇది నీలోపమని యెవరనిరి ? ఈ సౌమిత్రి యేనియు విధివిలాసమను చుండెనేగాని మన నేరమనెనా ? అందులకు మనమేమి చేయగలము ? వృధాకాలయాపన చేసిన నింకను ప్రమాదంబుల పాలగుదుమేమో యోచించితివా ? అయ్యా ! రామానుజా ! నా ప్రయాణము సిద్ధమైనది.

లక్ష్మ—నేనును సిద్ధముగనేయున్నాడ. (లేచి) అమ్మా! శాంతిమతీ! విచారింపకుము.

శాంతి—మహానుభావా ! విచారముగాక నాకింక సంతోషమెక్కడిది ?

గీ. పతిని గోల్పోయిన సతికి గతులులేవు
పతియె, జీవము, లోకము, భాగ్యమగుత
నట్టి పతిని బాసిన నాకు నరయ చింత
గాక, సంతసమే గతి గలుగునయ్య ?

లక్ష్మ—అందులకు నేను మాత్రము యేమి చేయుదును ? మా వదిన జానకి సైతము తలవ్రాలును తప్పించుకొనగల్గెనా ?

ఉ. చింతిలబోకుమమ్మ, తొలిచేసిన పుణ్యమొకంటియేని నీ
కాంతుని గాచునేమొ, వృథగా విలపించుటకంటె యింక నీ

స్వాంతమునందు శ్రీహరిని ధ్యానమొనరించుట మేలుగాదె, యి
క్కింత మనంబునందు వగపియ్యెడ మానము, ధైర్యమందుమా!

యయాతి: యింక పోవుదముఠమ్ము.

(ఇరువురు నిష్క్రమింతురు)

శాంతి—హాహా! నా దైవము నాకు దూరమగుచున్నాడా? నా పాలిటి పెన్నిధి హరించుచున్నదా? నా మాంగల్యము భంగమందు చున్నదా? నాధా! నాధా! ఈ వియోగము నేను భరింపజాల. వైధవ్యము కంటె ధర్మపత్నికి మరణమే మేలు. ఓ రామచంద్ర ప్రభూ! నీవు మహా రాజువు—ధర్మశీలుడవు—సత్యసంధుడవు. భార్యాభర్తల వియోగభార మెట్టిదియో నీకు తెలియనిదికాదు. మమ్మిట్లు దుఃఖపెట్టుట నీకు భావ్యము కాదు. నా పతితోబాటు నన్నును వధింపరాదా? పరలోకమునందు నైనను మా భార్యభర్తల విడదీయని పుణ్యమూర్తివయ్యెదవు. అగ్నిదేవా! నేనీ వియోగానలంబుల భరింపలేకున్నాను. మున్నెందరో మానవతులు నీ సముఖంబుననే దేహత్యాగంబొనరించి శాశ్వితకీర్తి గడించిరి. నాకును జీవన్ముక్తి ప్రసాదింపుము. (పోబోవును.)

(తెరలో) శాంతింపుము - శాంతింపుము.

శాంతి — (వెనుకకు తిరిగిచూచి) ఎవరా పిలుచునది?

(నారదుడు ప్రవేశము.)

శాంతి — నారద మునీంద్రులవారా? నమస్కారములు. దయచేసి యీ పీఠమునం దాసీనులుకండు.

నార — (కూర్చుని) దీర్ఘసుమంగళీభవ!

శాంతి — మీ యాశీర్వాదము........

నార — తప్పక ఫలింప నున్నది.

శాంతి — ఏమి? విశ్వామిత్రుడు కరుణించునా?

నార — కాదు. కాదు. ఆతని శపథంబునుండి రక్షణబొందుట కొక చక్కని యుపాయమాలోచించి చెప్పవచ్చితిని. ఇంతకు యయాతి యేడి? ఎటుబోయెను ?

శాంతి — (దుఃఖించుచు) ఇంకెక్కడి యయాతి మహాముని!

నార — ఏమి ?

శాంతి — ఏమని చెప్పుదును ?

గీ. కోసలేశుండు పతిజంప బాసచేసె
దాన సౌమిత్రిగొనిపోయె దయదొలంగి
యింకనెక్కడి నాథుండు యేమిబ్రతుకు ?
నుంత దోచక చింతించు చున్నదాన.

నార — అయ్యయ్యో! ఎంతపని జరిగినది? నేను వానికి రక్షణో పాయము నెరింగించుటకే వచ్చితిని. ఇంతకు దైవనిర్ణయ మెటులున్నదో!

శాంతి — ఇంకను దైవనిర్ణయ మనుకొననేల మహాముని!

నార—అటులనబోకు మమ్మా! జరుగబోవుదాని నెవరు చూచిరి?

సీ. వేట కేతించిన విభుడా మునుల చూడ
నెదనెంచి యరుదెంచు టెవ్వ డెరుగు?
ఆ వశిష్టమునికి నాచరించిన దణ్ణ
మీరీతి మారుట నెవ్వ డెరుగు?
గాధిపుత్రుని వాంఛకై రఘురాముండు
నీ పని కొప్పుట యెవ్వ డెరుగు?
సౌమిత్రి స్వయముగ నీ మహీనాయకు
నింతలో గొనిపోవు టెవ్వ డెరుగు ?

గీ. అచ్చెరువుగ నీ మార్పులు వచ్చి నటులె
వచ్చునేమొ నీ కాంతుని భాగ్యరేఖ;
ముందుగా మరణంబేల పొందె దీవు
తొందరొందగబోకుమో యిందువదన!

శాంతిమతీ! ఆత్మహత్య మాత్రము చేసుకొనకుము. నేనును నీ పతిని రక్షించు కార్యమునందే చరింతును. తుట్టతుద కెట్టులైనను యయాతిని కాపాడి, కాశీపురమునకు బంపుదును. నిశ్చింతగ నుండుము.

శాంతి—నిజమా ?

నార—ముమ్మాటికి.

శాంతి—అటులైన నేను ధన్యురాలను.

నార—కాదన గల వారెవరు?

శాంతి—మీరు........

నార—శ్రద్ధగ చరించెదను. అమ్మా! నే నింక బోయి వత్తును. ధైర్య మందుము. మఱియు నీ కొక మహామంత్ర ముపదేశింతును. దానిని నీమము దప్పక పఠింతువేని, ముల్లోకంబు లేకమైనను నీ పతి ప్రాణంబుల హరింప లేరు.

శాంతి—మహాప్రసాదము.

(తెర వ్రాలును)



ఓమ్

# శ్రీ రామాంజనేయ యుద్ధము

## చతుర్థాంకము

(రామేశ్వరమున, ఆంజనేయులు ప్రవేశము)

ఆంజ—(చేతులు మోకరించి, నిమీలితనేత్రుడై) రామా! రఘుకుల సోమా!

శా. శ్రీరామా! యినవంశక్షీర నిధినిన్ జెన్నొందు సోమా! యశః
కామా! సద్గుణధామ! రామ! నిను నే కైవారమున్ జేతు న
న్నోమన్ జాలిన దేవదేవ! దయ నన్నున్ జూడవే! కూర్మి నా
సామీప్యంబును జేరవే? ముదమునన్ సంభాషణల్ సేయవే?

(తెరలో)—నాయనా! కుమారా!

ఆంజ—అమ్మా! ఇదిగో వచ్చుచున్నాను.

(అని పోబోవ, అంజనీదేవి యెదురగును)

అంజనీదేవి—నేనే వచ్చితిని నాయనా! నిరంతర శ్రీరామ నామ స్మరణాపరాయణుండవగు నీ నీమంబున కంతరాయము చేయుదునా, తండ్రీ!

ఆంజ—అమ్మా! శ్రీరామచంద్రుండు దైవము కాకపోడు. అంత మాత్రమున మాతృదేవి సేవమాత్రము మరతునా? నేనిదె ఫలాదులకుం బోయివచ్చెద. ఇందే కూరుచుండుము.

(నిష్క్రమించును.)

అంజనీ—రామచంద్రభూపాలా! నీ మహిమంబు లేమని వర్ణింతును తండ్రీ!

సీ. నీ కృపచేతనే నిఖిలమౌనుల కిల
పాపి దైతేయుల బాధ తొలగె;
నీ కృపచేతనే, నెలత యహల్యకు
పతి శాపముక్తి సంప్రాప్తమయ్యె;
నీ కృపచేతనే, నిజము జటాయువు
దహన క్రియలతోడ ధన్యతగనె;
నీ కృపచేతనే మా కపిరాజు వి
భీషణుల్ నృపులు వెలయగలిగె

గీ. అట్టి సర్వోత్తమంబునై యలరునట్టి
నీ కృపనుమించు భాగ్యంబు నేడుగలదె ?
రామ! గుణధామ: దనుజ విరామ ! రవికు
లాంబుధీసోమ ! తారకరామ ! నామ

(తెరలో)—లక్ష్మణా ! లక్ష్మణా !

అంజనీ—(ఆలకించి) ఏమి ? ఇందు లక్ష్మణుని సంబోధించు వారెవరు ? సౌమిత్రి యిందు రాగతంబేమి ? (దిగ్గరగ) అయ్యా ! తామెవరు ? ఇటురండు.

(యయాతి ప్రవేశము.)

యయా—అమ్మా ! అంజనీదేవీ ! యయాతి నమస్కరించు చున్నాడు.

అంజనీ—శ్రీరామభక్తాగ్రణి యయాతి మహారాజా ! అయ్యా ! మీరిటేల వచ్చితిరి ?

యయా—ఏమిచెప్పుదును తల్లీ ! నాజీవితము దుఃఖసాగరంబున మునింగి పోయినది. ఎవరితోచెప్పి యేమి ప్రయోజనము ?

అంజనీ—భయమందకు నాయనా! నా కుమారుడు హనుమానునితో చెప్పి నీ కభయదాన మిప్పింతును. రామేశ్వర పుణ్యక్షేత్రమును జొచ్చిన వారికి గూడ ప్రమాదము లుండునా ?

యయా—అమ్మా! ఎందులకంత శ్రమనొందెదవు? నను రక్షించువారీ పదునాల్గు లోకంబులందును లేరు.

అంజనీ—అటులనబోకుము యయాతీ! నా కుమారుడు సామాన్యుడనుకొంటివా యేమి?

యయా—వీర హనుమానుని చరిత్ర లోక విదితమేగదా తల్లీ!

సీ. కౌపీన మాది, యజ్ఞోపవీతంబులు
గలుగ ధారుణిజన్మ గాంచినాడు
బాలభానునిమ్రింగ పరుగెత్తి శాస్త్ర శా
స్త్రాంగము లన్నింటి చదివినాడు;
నూరు యోజనముల వారిధి నవలీల
దీటుగ లంఘించి దాటినాడు;
వేలాది రాక్షస వీరులను వధియించి
బంటులలోన పేర్వడసినాడు;

గీ. అర్ధ రాతిరివేళ ద్రోణాద్రి నెత్తి
చిన్నరాయిగ లంకకు చేర్చినాడు;
దశరథాత్మజునకు ప్రీతి దనరినాడు
అంజనీ పుత్రుడంచు మే మరయలేమె?

ఐనను నన్ను మాత్రమ్ము కాపాడుట దుర్లభము.

అంజనీ—యయాతీ! భయమందకుము.

గీ. అంజనీదేవి సాధ్వియై యలరునేని;
వాయు పుత్రుడు శ్రీరామ భక్తుడేని:
యేది యెటులైన, కష్టము లెన్నియైన
నీతి విడక నిన్నేలు, యయాతి రాజ!

యయా—(స్వగ) ఆహా! ఇంత దనుక నే పురుషుండు నొసంగ లేని యీ యభయ ప్రదాన మీ పొలతి ప్రసాదించినది. తరువాత నావ్రాత యెటులున్నదో గదా!

(ఆంజనేయుడు ప్రవేశము)

యయా—అంజనీ పుత్రా! అభివాదములు.

ఆంజ—చిరాయుష్మంతుడవై వర్ధిల్లుము.

యయా—ధన్యుడను.

అంజనీ—నాయనా! మారుతీ! అతండు కాశీపురాధీశుం డగు యయాతి మహారాజు. అతం డేలనో భయమందుచు మన యాశ్రమం బును చేరినాడు. ఆర్తత్రాణ పరాయణము మనకు ప్రధానము గాన వానివి రక్షించెద నని వాగ్దానము చేసితిని. నామాట మీరక నీ రాజును కటాక్షింపుము.

ఆంజ—మాతృదేవి యానతిని మీరుదునా? యయాతీంద్రా! నీ కింక భయము లేదు చెప్పుము. నీ కపకారంబు సేయంగ బూనిన వాదెవడు? క్రోధ కారణమేమి?

యయా—అయ్యా! చెప్పుటకు........

ఆంజ—భయము తీరలేదా? అటులైన యిటు వినుము.

ఉ. భూమి సమస్తమున్ పగిలి పోయిన; తారలు క్రిందరాలినన్;
కామవిరోధి నన్నెదిరి కయ్యము సేయగ వచ్చుగాక, యిం
కేమెటులైన తల్లి సెలవిచ్చినరీతి దలంచి మించి నా
రాముని పాదమాన నిను రక్షణజేతు యయాతి భూపతీ!

(నారదుడు ప్రవేశము.)

నార—నారాయణ! నారాయణ!

యయా—నారదమునీంద్రులకు వందనములు.

నార—విజయీభవ! యయాతీంద్రా! లక్ష్మణుడు నిన్ను కాశీ నగరంబునుండి వెంటనిడుకొని వచ్చుచుండెనని వినియుంటిని. అతడే మయ్యెను? నీ విటులేల రాగల్గితివి?

ఆంజ—(ఆశ్చర్యముగ) ఏమీ! లక్ష్మణుడా? ఏడీ?

అంజనీ—ఔనుసుమా ! ఇంతకుముందే యయాతి "లక్ష్మణా" యని పిలుచుచునే యిందు వచ్చినాడు. నేనామాటయే మరచి పోయితిని.

యయా—బ్రహ్మమానస పుత్రా! సౌమిత్రీ సమేతంబుగ పయనమై వచ్చుచు పరిసరంబుల విశ్రాంతికై రథంబు డిగ్గి యిరువురము కూర్చుంటిమి. అంత ననంతవాయు సహిత వర్షంబు వచ్చుటంజేసి మేమిరువురము వేరై; తిరిగి, తిరిగి యిందు జేరితిని. దేవీకృపవలన నీ మారుతి ననుంగావ నభయ మొసంగె.

నార—రామరామ ! నాటకమెంతటి చిత్రంబుగ నడిచినది. అంజనీ తనయా ! యయాతీ ప్రాణాపహరణంబు సేయనున్న దెవరో యెరిగియే శరణొసంగితివా ?

ఆంజ—తెలియదు మునీంద్రా ! ఎవ రాతడు ?

నార—ఇంకెవరు ? శ్రీరాముడు........

ఆంజ—ఆ ! ఆ ! రాముడా ?

నార—ఔను రాముడే.

ఆంజ—యయాతీ ! నారదుని మాటలు సత్యములా !

యయా—వారు సత్యమునే వచించు చున్నారు.

ఆంజ—అకటా ! ఎంత ప్రమాదము జరిగినది ? కాశీరాజా ! రాముఁడేమి ? మిము చంప బూనుటేమి ?

యయా—అయ్యా ! నే నొకనాడు సరయూనదీ ప్రాంతమున వేటాడ బోయితిని. అట మృగయా వినోదంబు పూర్తి గావించుకొని వశిష్టముని యాశ్రమంబును జేరి ముందుగ నా యరుంధతీ పతి కంజలి మోడ్చితిని. అయ్యది విశ్వామిత్రునకు తీరని యవమానకరమని కోపించి, నే నెంత వేడినను సైరించినవాడు కాడు.

ఆంజ—ఆహా ! అదియును నేరమేనా ?

అంజనీ—తరువాత నేమైనది ?

నార——ఆ పైన గాధేయుండు శ్రీరాముని జేరి తానొక దురాత్మ నిచే పరాభవ మందితినని వక్కాణింప, జానకీ నాథుం డీ యుదంత మెరుంగక గురువంచకుని హత మొనరింతు నని శపథంబు చేసె.

అంజ——అయ్యో! ఎంత మోసము ?

నార——మోసమని పిమ్మట నెరింగియు చేయునదిలేక యయాతీ వధ కంగీకరించి వీని దోడ్కొనిరా సౌమిత్రి నంపెను. కడమ చరిత్ర మీ రెరిగినదే కదా!

అంజ——అటులైన నేనిపుడు నా పాలిటి భగవానుడైన శ్రీరామ ప్రభువుతో వైరంబు దెచ్చుకొంటి నన్నమాట ?

నార——అని మేమనగలమా ? మారుతీ! నీవు యయాతి కభయ ప్రదాన మొసంగినటు లాలకించినచో దాశరధి కరుణించునేమోలే.

అంజ——మహాత్మా! ఇదియెంతయు వింతగ నున్నదిగదా ?

ఉ. దోసములేని దానికయి దొడ్డపగన్ గనె కౌశికుండు, ఆ
మోసమునందు పంక్తిరథ పుత్రుడు వీని వధింపబూనె; నే
ధ్యాసయు లేకయే నభయదాన మొసంగితి గాతునంచు నా
కౌసరివారు నవ్వ, మరి యా రఘురాముడు రోసమందగా.

యయా——(స్వగతమున) ఈతండు నన్నారామునికి వప్పగింపడు గదా ?

నార——మారుతీ! ప్రమాదము లెంతటివాని కేనియు జరుగు చుండును. నీ మాటటుంచుము. నీ ప్రభువుయు, నిత్య సత్యవ్రత శీలుండును, నిఖిల ధర్మవేత్తయునగు నారామచంద్రుడే పొరపాటు చేసినపుడు పరుల మాట వేరుగా చెప్పవలయునా ?

అంజ——మహాత్మా! ఇపుడు నన్నేమి చేయమంటిరి ?

నార——అదినీవు నిర్ణయించదగిన విషయంబు. కష్టసుఖంబు లనుభ వించు వాడవు నీవుగాని మేము కాముగదా ?

అంజనీ——మునిచంద్రా! ధర్మమును దెలుపుటకేమి ?

నార—ఆ ధర్మమునకు బద్ధపడియే శ్రీరాముడు యింతపని చేయుచున్నాడు. ఇక నే నేమి చెప్పుదును ?

గీ. గురుని కిచ్చిన మాటకై ధరణి విభుడు
భక్తునేదును మాడంగ భావ్యమనియె
అటులె తల్లికిచ్చిన మాట నాత్మదలచి
నీ వభయదాన మిచ్చుటే నీతిపథము.

వాయునందనా ! ధర్మమును చెప్పమంటిరి—చెప్పితిని. ఇటు సత్య వాక్పాలన—అటు ప్రభు వాక్పాలన. ఇందు మాతృదేవి గౌరవంబు కాపాడ వలయును—అందు ప్రభుచంద్రుని న్యాయంబును పాలించ వలయును. ఇందెయ్యదావశ్యమో. యెయ్యదనావశ్యమో నేను మాత్రము చెప్ప దగినది కాదు.

ఆంజ—కటకటా ! ఇపుడేమి నేయగలను ?

మ. కలనైనన్ రఘురాముతో నిలిచి సంగ్రామంబు గావించు నం
చలు సంతేనియు నెంచలేదు, యిపుడీ సందర్భమందేను ని
ర్మల దీక్షాపరతంత్రు; నర్కకుల పారావార పూర్ణేందుతో
కలహంబున్ గొనితెచ్చుకొంటి నకటా ! కర్మంబటుల్ కాలెనే ?

నార—ఆంజనేయా ! గతించిన దానికి చింతించి యేమి ప్రయోజనము ? ముందు కాగల కార్య మేదియో నిర్ణయింపుము. సత్యవాగ్రక్షణార్థంబుగ నీ యయాతిని రక్షించుటయా ? రామాభిమానంబున వీని విడి పుచ్చుటయా ?

ఆంజ—ఆః ! యయాతిని విడిపించుటయా ? అభయం బొసంగి వెనుకాడు టీ యాంజనేయు డెన్నడేనియు నెరుంగునే ?

ఉ. రాము డెదుర్చుగాక, ధర రక్తపుటేరులు బారుగాక; నీ
భూమియు నాకసంబులును భోరుమటంచు ధ్వనించుగాక సం
గ్రామము చేసియైన నిజకాయము నందున జీవముండ సు
క్షేమముగా యయాతిని ప్రసిద్ధత గాచెదనంటి నమ్మడీ !

నార—తథాస్తు.

యయా—(స్వగతమున) అమ్మయ్య! ఇప్పటికి బ్రతికితిని.

నార—ఆంజనేయా! ఈ మాట వినుటకే యింతసేపు కాచి యుంటిని. మహాబలాఢ్యుడైన వాయుదేవుని కుమారుడవు—ఈశ్వరాంశ సంభూతుండవు—సూర్యభగవానుని శిష్యుండవు—విశ్వకర్మవర సంపన్ను డవు—శ్రీరామ పాదసేవకుడవగు నీవు నీ ధర్మము నెట్లు కాపాడు కొందువో యని నేనింత దనుక తహతహ లాడుచున్నాను. నా కా సందియము దీరినది. ఇంక బోయి వచ్చెద.

(నిష్క్రమించును)

ఆంజ—ఆహా! రామచంద్రునితోడనా విరోధము?

ఉ. రాముడె నాకు రక్ష, రఘురాముడె దైవమటంచు నెంచి యా
నామమె సంస్మరించుచు ఘనంబుగ వర్తిలుచుంటిగాని, సం
గ్రామము నేతు నంచును యొకానొకనాడు దలంచియుంటినే?
ఆ మహనీయుతోడ రణమం దెదిరించు దినంబు వచ్చెనే?

(సుగ్రీవ, అంగదులు ప్రవేశము)

ఆంజ—సుగ్రీవ మహారాజా! అంగదకుమారా! రండు-రండు.

సుగ్రీ—ఆంజనేయా! విచారింపకుము. ఇంతకు ముందే నారదుల వారివలన విషయ మంతయు వింటిమి.

ఆంజ—కపి నాయకా! శ్రీరామచంద్రునితో వైరంబు దెచ్చుకొం టినిగదా, యెట్లు చేయుదును?

సుగ్రీ—నాకును కర్తవ్యము తోచుటలేదు.

అంగ—మారుతీ! యయాతిని విడిపించుట.........

ఆంజ—అసంభవము.

అంగ—ఆ నిర్ణయంబునకు వచ్చితివికాన; రాయబార మంపుటయే ప్రధానకర్తవ్యము.

సుగ్రీ—ఎవరికి?

అంగ—మరెవ్వరికి ? శ్రీరాములవారికి.

ఆంజ—ఏమని ?

అంగ—అంజనీ పుత్రుం డొసంగిన నభయప్రధానంబును కాపాడుమని—

ఆంజ—అందుల కాత డంగీకరించునా ?

అంగ—అంగీకరించక పోయినను మన మాచరింప దగిన కార్యమదియేగదా !

ఆంజ—రాముడందులకు నంగీక రింపనిచో........

అంగ—తదుపరి కర్తవ్యమాలోచింతము.

సుగ్రీ—అంగద సందేశము న్యాయసమ్మతము.

అంజనీ—అటులైన దూతకృత్యము నిర్వర్తించువారెవరు ?

ఆంజ—ఎవరోయేల ? నేనే పోయెదను.

గీ. తొలుత సుగ్రీవ రాముల చెలిమి వేళ
పూనిరాయబారిగ నేనె బోయినాడ;
ఇక యయాతిని గావంగనిపుడు గూడ
దూతనై బోయివత్తు నా దొరలకడకు.

అందులకు మరియొక విశేషము గూడకలదు.

గీ. భక్తులము మనమిక, భగవానుడతడు;
దైవమునకు దాసుడన బేధంబు లేదు;
చెప్పుకోదగినట్టి విశేషమెల్ల
చేరిస్వయముగ ప్రార్థన చేయువాడ.

అందువలన నొకింత యుపయోగ ముండకబోదు.

సుగ్రీ—వాయుకుమారా ! నీ నుడువులు యదార్థంబులే గాని, ప్రస్తుతము నీరాయబారమంత సమంజసముగలేదు. ఏలనన.

గీ. చంప దాశరథిప్రతిన సలిపియుంచె;
యేనుగాతునంచు నభయమిచ్చి తీవు;
రాయభారంబు సేయ పరాయివారు
తగునుగాని, తగదు వాయుతనయ! నీకు.

అంజనీ—కుమారా! సుగ్రీవ మహారాజు వచించినదియు యదార్థమే.

అంజ—అట్లైన నెవరినిపంపగలము.

సుగ్రీ—తగినవానినంప వలయును.

అంజనీ—అందుంకు మనయంగదుండు తగినవాడు.

సుగ్రీ—అంగద రాయబారమున విజయంబు చేకూరగలదు.

అంజ—నేను అటులే భావించు చున్నాను.

సుగ్రీ—అంగదా? అయోధ్యకుంబోయి వచ్చెదవా?

అంగ—అది రాచకార్యముగదా! అనుభవ పరులు నిర్వహింప దగిన యిట్టి కార్యంబులను నాకు నియోగింతురా?

సుగ్రీ—అంగదా! అటులనకుము.

ఉ. బాలుడవీవు, రామపదభక్తుడ వంతియుగాక; నీ పయిన్
జాలియు కద్దు నీ జనకు జంపిన కారణమందు; కావునన్
జాలములేక నీ వలన సంధిపొసంగు నటంచు నెంతు నిం
కేల నయోధ్య కేగుటకు నింతసుషూనము వాలినందనా!

అంజ—అంగదా! మరియొక రహాశ్యము నెరుంగుము. రాము డొకవేళ మన ప్రార్థనలాలింపక బోవచ్చును. ఆసమయంబున నీవెదియేని మాట జారినచో మరొకసారి మేమందులకు "రామచంద్రప్రభూ! అంగ దుడు పసివాడుగదా, తెలియక నన్నమాటలు మీరు పాటింపవచ్చునా?" యని సమాధాన పరచుటకేనియు నవకాశముండును.

అంగ—సరి, కానిండు మీరంద రింతగ చెప్పుచుండిన నేను కాదందునా?

అంజనీ—మంచిది పోయిరమ్ము.

అంగ—ఇంతకు సంధివచనంబులెట్లు జరుపవలయును ?

అంజ—అంగదా ! ప్రాయమున పసివాడవయ్యును, బుద్ధికి బృహస్పతివి గదా ? నీ కంతగ చెప్పదగిన పనియేమున్నది ?

మ. చని, యాపంక్తిరథాత్మజుంగని, నమస్కారముల్ జేసి నీ
వును వారందరి యోగక్షేమముల సమ్మోదాన నాలించి యే
వినయంబొప్పగ దెల్పుమీ విషయ ముర్వీనాథు డాలింప మ
మ్మను కంపన్ గనుమంచు వేడుకొనుమా ! ఆనంద మింపొందగన్

అంగ—అదియంతయు ప్రథమంబున జరుగు కార్యక్రమమే గదా ?

అంజ—ఆ తరువాత జానకీ రమణునితో యిట్లు వచింపుము.

సీ. తరతరా లాదిగ, తగ పురోహితమున
చెన్నొందు వాడు వశిష్టమౌని;
అతని కథివాద మాచరించిన యయా
తియు నీదు భక్తి వర్తించు వాడు;
గత మెరుంగకయె వాగ్దాన మిచ్చినవాడు
నీ కాప్తుడగు నంజనీ సుతుండు;
పరువు గల్గిన కపివర్యు లందరు మిమ్ము
వేడ్క సేవించెడు భృత్యగణము;
గీ. ఇందు పరులెవ్వరయ్య నీ కెంచిచూడ,
దయయు దాక్షిణ్యముల చూపి దనరుమయ్య !
గాధిసుతు డెంత గురువైన గాని, ధర్మ
పాలనంబు సేయుటె కీర్తి వరలునయ్య !

అని విన్నవింపుము. నీ మాటలు కూడ కొంతదనుక వచింపుచు;

అంగ—సుగ్రీవ మహారాజా ! మీ రేమైనను చెప్పుదురా ?

సుగ్రీ—చెప్పకబోవుటేమి ? అయోధ్యకుం జని, అట లక్ష్మణ, భరత, శత్రుఘ్న సమేతుండగు నా రాఘవునితో నా మాటలుగ........

శా. రామా ! మా పవనాత్మజుం డెపుడు మీరంటోడు మీయాన, నే
దేమో తప్పిద మాచరించె, కృపనెంతేచెన్ విలోకించి యీ
మా మీ వంశములందు నున్న హితమున్ మర్యాదలన్‌గాచి యే
దో మార్గంబున సంధి సేయుచును, నాదోసంబు సైరింపుమా !

మీరంత పట్టుదలగ మాటలాడ జూచినను యిందు మా తప్పు నలుసంతయు లేదు. ఎటు లందురేని మీరు విశ్వామిత్రునికై యయాతిని వధింప బూనితిరి — మా హనుమానుండు నంజనీ దేవికై యయాతిని పాలింతు ననియెను. ఇరువురు తెలియక వాగ్దానంబులను చేసినవారే— యిరువురును ఆడినమాట నిల్పుకొన చూచుచున్నవారే—యిరువురును స్వాభిమానపరులే. ఐనను, మీ రొనరింపబూనిన పనులలో న్యాయా న్యాయంబులను యోచింపుమని చెప్పుము. మరియును

సీ. మా యయాతీరేడు మత్సరంబునను, వి
శ్వామిత్రు నవమాన పరచలేదు;
మిమ్మెదిరింప, సమీరపుత్రుండు - య
యాతికి నభయ మియ్యంగలేదు;
వీరులమని రాయబారంబు నేయంగ
శూరతనము నేమి చూపలేదు;
నీదు భక్తులమాట నీతిపధము నేమి
జవదాటి సుంతైన సలుపలేదు;
గీ. నేటికైన మీయెడ పగ నెరపలేదు;
మానసంబున మీసేవ మరువలేదు;
కపుల నన్యులకై వడి గాంచకయ్య ?
యీ విపత్తు నుండియు మమ్ము గావుమయ్య !

అనియు దెలుపుము—

అంగ—అటులనే భాషింతును. అయ్యా ! యయాతిరాజా! మీరును గూడ రామభద్రుని కేమైన సందేశము నంపుదురా ?

యయా—.మీరందరికంటె నేనుమాత్ర మేమి విశేషము చెప్పుదును ? నీవే సర్వభారమును వహించి రామునకు దయగల్గునట్లు చేయుము.

ఆంజ—అటులందువేమి ? ఈ యకారణ కలహంబునకు కార ణంబు నీవేగదా ? నీ యభిప్రాయము గూడ నివేదింపుము. రాముడు, దయాగుణ సాంద్రుడు. కాచిన కావగలడు..

సుగ్రీ—అప్పను నీ ప్రార్థనయు రామహృదయంబును కరిగింప దగినదియే.

యయా—అంగదకుమారా ! రామభద్రునితో నా ప్రార్థనగ....

సీ. ప్రథమాంజలికి నింతపట్టింపు లగునంచు
చిత్తమం దెరిగి నేచేయలేదు;
ఇది ప్రమాదమటంచు నెంతేని గాధేయు
పాదమంటక, గర్వపడనులేదు;
సౌమిత్రివెంట కోసలకు రాకుండగ
మీయాన నిసుమంత మీరలేదు;
ప్రళయ మారుతమున బాట దప్పయు, దాగి
యుండ తలంపు నే నొందలేదు;

గీ. ఆంజనేయుండు నీరీతి నభయమిడిన
గాని మదిలోన గర్వంబు గాంచలేదు;
యింతచేసిన మీయుష్మత్స్మరియింపమాని
కడకు నొక్కమాటైననే నుడవలేదు.

ఇట్టి నన్ను వధించుట మీవంటి వారికి పాడిగాదని చెప్పుము. దేవర వా రనుగ్రహింతురేని, మీ న్యాయస్థానంబున నేనియు; గాధేయుని సము ఖంబున నేనియు క్షమాభిక్ష కోరుకొను మనిన కోరుకొనుటకు సిద్ధముగ నుంటిననియు బలుకుము—యయాతివంటి భక్తుని జంపుట నీవంటివానికి కూడని పని యనియు వక్కాణింపుము.

అంగ—అటులనే దెలిపెద.

అంజనీ—నాయనా ! అంగదా ! మీరందరి సందేశంబులు వినిన పిమ్మట నా రఘుపతి మన్నింపడేని నామాటగాగూడ యిట్లనుము.

సీ. ఆంజనేయుండుల నని లాత్మజుడనియె
గాని. తంద్రిగ నీవె గాంచినావు;
బిడ్డలక్షేమంబు పేరు ప్రతిష్ఠలు
తగురీతి గాపాడ తంద్రివంతు;
సుతు లవినీతితో పతనమందిననాడు
గురువులే దానికై కుందవలయు;
తమ నీతి వంటిదే తగు భక్తుని విధంబు
నుభయ బాధ్యతలు నీకున్న విపుడు

గీ. దశరథాత్మజుండ వగుట— ధర్మప్రభువు
వగుట— ఆర్తరక్షణమూర్తి వగుట ప్రోవు
మనుచు కేల్మోడ్చినారము మనుజనాథ!
న్యాయమార్గ మేదియొ ముందు నడుపుమయ్య!

అని నా మాటలుగ ప్రార్థింపుము.

అంగ—మంచిది. మీ యందరి యాశీర్వాద ప్రభావంబుననేమి? మనకులేంద్రునినైజ కరుణావిశేషంబున నేమి? సఫలమనోరథుండనై రాగలనని విశ్వసించు చున్నాను.

గీ. పెద్దలైన వారు తొలగి సుద్దులాడ
తలకుమించు భారము మోయ దాల్చినాడ,
రాముడే మనునో? కార్యమేమి యగునో?
సర్వమీశ్వరార్పితమంచు చనెడివాడ.

(నిష్క్రమించును)



ఓమ్

# శ్రీ రామాంజనేయ యుద్ధము

## పంచమాంకము

(అయోధ్యలో శ్రీరాముడు, భరతుడు, శత్రుఘ్నుడు, నారదుడు కూర్చుండి యుండ తెర లేచును.)

శ్రీరా—మహాత్మా! మీరు త్రిలోక సంచారులుగదా? అందేదయి నను వింతగల వార్తలున్న దెలిపెదరా!

నార—రామభద్రా! వినదలంచిన వార్తలు లేకపోయినవా?

శ్రీరా—ఏమది?

నార—ఆఁ ఏమున్నది? ప్రస్తుతము నేను రామేశ్వరమునుండి వచ్చు చున్నాను.

శ్రీరా—రామేశ్వరమునుండియా? అటులైన నందలి సమాచారంబులను దెలుపుము మహానీయా!

నార—(నిరుత్సాహముగ) ఆఁ! ఏమని చెప్పుదును?

శ్రీరా—(ఆతురతతో) అటులంటిరేమి మహామునీ!

చ. అరయగ వాయునందనుడు హాయిగనుండెనె? తల్లి యంజనీ
తరుణికి క్షేమమే? అచటి తాపసులెల్ల సుఖించు చున్నె వా
నరపతి భద్రమే? మరియు నా హితులైన కపీంద్రులెల్ల సు
స్థిరముగ నున్న వారెగద చెప్పుము, నారద మౌనిచంద్రమా!

నార—అచటి వారందరును కుశలముగనే యుండిరి. సరికాని, రామా, లక్ష్మణుడు కనుపించడేమి?

భర—ఆతడొక కార్యార్థియై కాశికివెళ్లి యుండెను.

నార—తిరిగివచ్చు గడువింకను రాలేదా ?

శత్రు—గడువు దాటిపోయినది.

నార—ఇంకను రాని కారణము ?

శ్రీరా—అదియె, తెలియదు దేవా !

నార—కాశికి బోయిన కారణ మారయవచ్చునా ?

శ్రీరా—యయాతిని వెంటగొని రాబోయెను.

నార—అటులనా ! అందులకే యింతగ నడిగితిని.

భర—ఏమి ?

నార—యయాతి కాశీరాజ్యములో నున్నాడా?

శత్రు—మరి యెందున్నాడు ?

నార—రామేశ్వరములో హాయిగ, స్థాయిగ, ఆంజనేయుని యాశ్రమంబులో నున్నాడు.

శ్రీరా—ఆఁ ! యయాతి హనుమానునివద్ద నుండెనా ?

నార—ఉండక నేమి చేయగలడు ? శ్రీరామ బాణంబునకు గురి కాకుండ కాపాడెదనని, అభయప్రదాన మొసంగి, వీరకంకణము గట్టుకొన్న మారుతిని విడిచి యయాతిని రమ్మన్నను వచ్చునా ? రాడు – ఇక రాడు – ఎంతమాత్రమును రాడు.

శ్రీరా—ఆఁ ! ఆ ! ఆంజనేయుండు యయాతి కభయ ప్రదాన మిచ్చెనా ?

నార—ఇచ్చెనా యని యింకను గ్రుచ్చి గ్రుచ్చి యడుగనేల ? కాకయున్న నీ తమ్ముడేల యింకను రాకయుండును ?

శ్రీరా—ఔరా ! ఎంతపని జరిగినది ? ఆంజనేయు డెంతటివా డయ్యెను ?

ఉ. ఇంతటి మోసగాడనుచు నెంచకబోతి నొకప్పుడైన, నా
పంత మెరింగియున్, తిరిగి పాలనసేయ; యయాతి ముందు తా

మంతన మాడువాడె, హనుమంతుడు నేటికి జాతి లక్షణం
బంతయుచూపె, నా హృదయమందు దవాగ్నియునుజ్వలంబుగాఁ.

నార—రామచంద్రా! నీ ప్రతిన నెరింగియే హనుమంతుడా కాశీ రాజున కభయ మిచ్చెనో? యెరుగకయే యిచ్చెనో నెరుంగనుగాని, మొత్తముమీద యయాతి మారుతి రక్షణ యందున్న మాటమాత్రము యదార్థము.

శ్రీరా—ఐన లక్ష్మణుం డెందుండె?

నార—నాకు మాత్రము తెలియునా?

మ. అతడా కాశిపురాధినాధుం గనగా నందందు వీక్షింప ప
ర్వత భూకానన దేశదేశముల జేరంబోయెనో నేను దె
ల్పతరంబెట్లగునంచు నన్నిటుగడం బ్రశ్నింతువో జానకీ
పతి! చిత్రంబగు, చిత్తచాంచలనమునన్ భాషించు సంభాషణల్.

( లక్ష్మణుడు ప్రవేశము )

లక్ష్మ—పూజ్యులకు వందనములు.

శ్రీరా—సౌమిత్రీ! ఇదే వచ్చుచుంటివా?

లక్ష్మ—(తలవంచి) ఔను.

శ్రీరా—యయాతి కనుపించలేదా?

లక్ష్మ—(మౌనము వహించును)

శ్రీరా—రామేశ్వరంబున నాంజనేయుని వద్ద చూచితివా?

లక్ష్మ—అతం డందుండెనా?

శ్రీరా—నారదుల వారు చూచిరట.

నార—ఔను. ఆంజనేయుండు వానింగావ శరణొసంగె. ప్రాణ భీతిచే కాశీరాజం దుండుట నేను స్వయముగ చూచితిని.

లక్ష్మ—(రోషముతో) ఓరీ! మాయావీ! యయాతీ! ఎంతటి మోసముచేసితివి?

శా. నావెంటన్ బయనించు చుండియు ననున్ నమ్మించి, యీరీతి
పోవంజూచితె దుర్మదాంధుడ, నినున్ బోవన్ తొడన్గొట్టి నీ
తో వాగ్దానముచేసినట్టి ఖలునా దుర్మార్గునిన్ బట్టి ఖడింతునో
రీ! విశ్వాసవిహీన! చచ్చితివిరా! శ్రీరామ విద్రోహివై

నార—సౌమిత్రీ! శాంతింపుము—శాంతింపుము.

లక్ష్మ—ఏల ?

నార—ఆంజనేయుండు చిరంజీవి యను మాట మరచిపోయితివా? మారుతీ రక్షణ యందున్న యయాతిని ముట్ట సామాన్య మనుకొంటివా ?

శ్రీరా—తమ్ముడా! ఇమ్మునీంద్రుని మాటలు వినిన యయాతి నీకు కనుపించనే లేదనుకొంటిని. నీ యుచ్చారణబట్టి నీ కాతండు చిక్కియు మార్గమధ్యంబున పారిపోయె నని దెలియుచున్నది. ఇందేది నిజము ?

భర—అన్నా! లక్ష్మణా! ఏమి జరిగెనో చెప్పరాదా ?

శత్ర—విశదీకరించుట మంచిదియేకదా ?

శ్రీరా—శాంతించి సర్వమెరింగింపుము.

లక్ష్మ—అన్నా! దేవరవారి యనుమతి ననుసరించి నేను వారణాసికే బోయితిని. అంత యయాతియు, వాని భార్యయు నన్ను చూచి కొండంత భ్రాంతితో నేను వానిని రక్షించుటకై బోయితి ననుకొనిరి.

శ్రీరా—పాపము.

లక్ష్మ—తదుపరి మీరు రమ్మని రని చెప్పినంత యయాతి మారు మాట లాడక నా వెనువెంట పయనంబయ్యె.

శ్రీరా—అత డట్టి వినయగుణ ధురీణుండని నేనెరుంగుదును. నా యాజ్ఞ యనినంత నిరాకరించునా? నిరాకరించు వాడైనచో యింతగా మన మెందులకు చింతింప వలయును? తరువాత ?

లక్ష్మ—తరువాత శాంతిమతీదేవి యమాయకమును చూచి నా మనసు కరిగి పోయినది.

శ్రీరా—కాదామరి ?

లక్ష్మ—ఎట్టకేలకు నేనే విషయంబు చెప్పితిని. అంత నా దంప తుల దుఃఖ మవలోకించినపుడు నేనొక కిరాతకునికంటె కఠినుండనైతిని.

శ్రీరా—నేనును నిర్దాక్షిణ్యము వహించితినిగదా ?

లక్ష్మ—అనేక విధంబుల నామెకు సమాధానంబు చెప్పుచుండ యయాతియే నా వెంట పయనంబై రథ మధిరోహించె.

భర—అట్టివాడు తప్పిపోవుటెట్లు జరిగినది ?

శత్రు—మనసు మార్చుకొని పారిపోయెనా ?

లక్ష్మ—లేదు, లేదు. యావనాశ్వంబులు పరుగిడ, వారణాసిని దాటి చాలదూరము వచ్చితిమి. మార్గమధ్యంబున నొకచోట విశ్రమించి తిమి. ఆ సమయంబున లోకప్రళయం బటులు సుడిగాలి చెలరేగి; అంధ కార బంధురమువలె కారుమేఘంబులు గ్రమ్మి ధారాపాతముగ వర్షించె. ఆ కారణంబున మేము విడిబడి చెరియొక దారిబట్టితిమి. తరువాత యెంత వెతికినను యయాతి కనుపించనే లేదు.

శ్రీరా—ఐన నిందు కాలదోషమే కాని యయాతి దోషము లేదు.

లక్ష్మ—నాకు కలియకబోయినను తా నయోధ్యకు రాకూడదా ?

శ్రీరా—తమ్ముడా పొరబడుచుంటివి సుమా! ఎవరేనియు మృత్యు దేవిని మనసార నాలింగనము సేతురా ? తప్పిపోయిన గండమునకై సంతసింతురు కాని, కోరి గొంతు కోసుకొందురా ?

లక్ష్మ—అందువలన మనకెంతటి కష్టమో గమనించితిరా ?

సీ. అల గాధిరాట్పుత్రియాన, మీ రింతయు
పాటింపజాలని వారు గాగ;
అన్న యానతి నేను నాచరింపగలేని
తులువనై యీ రీతి తిరిగి రాగ;
అభయ మిచ్చిన యని లాత్మజుడు మనకు
కోరి తెచ్చుకొనిన వైరిగాగ;
చిక్కిన వానినే చేజారవిడువంగ
పదిమందిలో తలవంపుగాగ;

గీ. వచ్చినట్టులె వచ్చి; బల్మచ్చుచల్లి;
మోసగించి పోయెగద నా మోసకారి;
గోటితో పోవు దానికి గొడ్డ లిపుడు
పట్టవలసె నంచు మదికి బాధ గలిగె.

శ్రీరా—తమ్ముడా! పొరబడుచున్నావు. ఆలుబిడ్డల కాహారంబు లేక శోషించుట చూచి బోయవాడు చింతించు చుండును— ఆ బోయవాని వలలో బడిన పక్షిసమూహంబు స్వప్రాణరక్షణకై విలపించుచుండును. ఇది ప్రకృతి లక్షణమేగదా ? గాధేయుం డెపుడో కోపించునని మనమే యింత భయంబున నిర్దోషియు, మీదు మిక్కిలి భక్తుండునగు మరొకని వధింప సాహసించితిమి గదా ? చంపెదమని చెప్పి చంపబోవ నెవరి ప్రాణ మల్లాడదు ? ఏ జీవి రక్షణోపాయము నన్వేషింపదు ? కాని, తొందరబడి వాని కభయ మిచ్చినందులకే చింతించు చున్నాను.

నార—దాశరధీ! ప్రస్తుత కర్తవ్య మాలోచింపుము.

శ్రీరా—ఆలోచించుట కేమున్నది మహనీయా! మా శత్రుఘ్నునా యాంజనేయుని వద్దకుం బంపి; యయాతిని విడువుమని చెప్పింతును. మారుతి యంగీకరించునని తలంచెద.

నార—వాయుపుత్రుడు నీ పాదభక్తు డగుటంజేసి శత్రుఘ్ను సంధి కియ్య కొనునని యే నేనును నమ్ముచున్నాను. ఒకవేళ సమీరసూతి యయాతిని విడువక వ్యతిరేకించినచో........

లక్ష్మ—ఏమీ! శ్రీరామ దూత వాక్యంబులకు నా మారుతి తల యొగ్గి వధ్యుని గొనివచ్చి వప్పగించును గాని— రక్షింపడు.

భర—హనుమంతుండు మమ్మెదిరించుట కలలోని వార్త.

శత్రు—అతండు రాముడు గీచిన గీటు దాటునే ?

నార—అని నేను మాత్ర మంటినా ? అతండు రాముని యాన నెన్నడును మీరలేదు——.యికముందు మీరబోడు. అయ్యది మా కంద రకును తెలిసినవిషయమె. ఐనను యిట్టి కష్టకాలములందు కీడెంచి మేలెంచు

కొండులకైన మంచిది. ఏదేని కాలము వక్రమించి యాంజనేయుండా యయాతిని విడువననినచో మీరు మీ గురువున కొసంగిన వాగ్దానము.

శ్రీరా—మారరాదు.

కం. హనుమంతుం డిల దా
నని నేయదలంచు గాక; హరు డుద్రేకం
బున నెదిరించునుగాక నే
దుని మెదను యయాతి నింక దోర్దర్పమునన్.

నార—మంచిది. ఆఁ! రామచంద్రా! నే నింక బోయివచ్చెద. (ఇవతలకు వచ్చి) భళిరా! ఇప్పుడు నాటకము మంచిరక్తి గట్టినది.

గీ. కారణము లేకయే పెద్ద కలహమయ్యె;
మాటపట్టింపు లిట్టి పోరాటమగుట
పవనసూతి, రాములె, ముఖ్యపాత్రలైరి
హృదయ పర్వంబు నాకయ్యె నిప్పుడౌర!

(నిష్క్రమించును.)

శ్రీరాము—శత్రుఘ్నా! నీ విదే రామేశ్వరంబునకుం బోయి మారుతితో సంధి వచనంబులు దెలిపిరమ్ము.

శత్రు—అన్నగారి యాజ్ఞ.

శ్రీరా—నీవా రామేశ్వరంబున తొలుదొల్త వాని యోగక్షేమంబు లన్నియు విచారించి, కడమ కార్యక్రమంబునకుం గడంగుము.

మ. కలడో? లేడొ, యయాతి వానికడ నిక్కంబంత వీక్షించి; ని
శ్చల చిత్తంబున సావధానముగ విశ్వామిత్ర వాగ్దాన గా
థల నెల్లన్ వివరించి; రాము ప్రతినాధ్వర్యంబు నీదంచు ను
జ్వల దీక్షన్ విడు మీయయాతి నని సంభాషింపు మచ్చోటునన్.

నా హితం బాత డాలింప డేని—

గీ. మనకుగల మైత్రి సర్వంబు మరతువేని;
బంటువై మమ్మెదుర బూని యుంటివేని;

విడువబోకు కాశీపుర విభుని నీవు;
లేదయేని విడువు మీ వివాదమేల?

అని, అవసరంబైనచో యుద్ధంబునకు సిద్ధమనియు చెప్పిరమ్మ.

లక్ష్మ—శత్రుఘ్నా! మరియు నాహనుమానునితో నిట్లు బల్కుము.

సీ. రామచంద్రుడు లోకరక్షకుడై యొప్పు
మహనీయుడను మాట మరువ కనుము;
అన్యులకై మన మలుక వహించి క
య్యంబు లాడంగ నన్యాయ మనుము;
తెలియక చేయు తప్పు లెరింగి దిద్దుకో
గల్గుట గొప్ప విఖ్యాతి యనుము;
కలనాటి మాటలే కలకాలముందున
నెడు సామ్యమెంతయు నిక్కమనుము;
గీ. కాశినగ రేంద్రుగాచుట కానిదనుము;
మా హితంబు వినకనుంట ద్రోహమనుము;
రామ సందేశము వినంగ క్షేమమనుము;
వెడగు తనపు చేష్టలంక వీడుమనుము.

మరియును—

కం. ఈవు చిరంజీ వివనుచు
భావంబున నెంచి గర్వపడియెదవేమో
ఆ విశ్వామిత్రుని కో
పావేశము ముందు మనము భస్మముగామే?

అనియు వచింపుము.

భర—తమ్ముడా! శత్రుఘ్నా! అంతగ వినకున్న నా మాటలుగ కూడ నా సమీరతనయునితో వచింపుము.

ఉ. రామునితోడ బోరెడు పరాక్రమశాలి యొకండునేని యీ
భూమిని లేడటంచు, రణముఖ్యులు పల్కగ వింటివా పరం

ధాముడె నేటి కిట్టులు హితంబు వచింపగ బంపియుండె నీ
క్షేమము జూచుకొమ్ము పరసేమము పిమ్మట చూచుకోదగున్

ఇంకను;

కం. ఇది వినకున్న మనకునై
కదనము తప్పని సరియగు కారణముండెన్
వదలుము యయాతి నిక; రా
ము దయ ఘటించుగద నీకు మోదము నిండన్.

సోదరా! నీ శక్తివంచన లేకుండ ప్రయత్నించి క్షత్రియ, వానర కుల సంగ్రామంబు రాకుండ చేయుము.

శత్రు—అటులే ప్రవర్తించెద. అన్నా! రామచంద్రా! నా కింక శెల వొసంగుడు. పోయివచ్చెద.

శ్రీరా—శీఘ్రంబుగ బోయిరమ్ము.

(తెరలో)—ప్రభూ! అంగదుడు దేవరవారి దర్శనార్థమై వేచి యున్నాడు.

శ్రీరా—ఏమి, అంగదుడా! త్వరగ ప్రవేశపెట్టుము. శత్రుఘ్నా! వాలినందనుం డొక పక్షమున నాంజనేయి దూతయై వచ్చెనేమొ! వాని రాకకుం దగు హేతువు నెరింగిన పిమ్మటనే నీ రామేశ్వర ప్రయాణంబు స్థిరము చేయుదము. ఇంచుక నిలువుము.

(అంగదుడు ప్రవేశము.)

అంగ—(చేతులు ముకుళించి)

గీ. పంక్తిరథ రాజనందన! పాపహరణ!
జానకీ మనోరమణ! ఇక్ష్వాకువంశ
పావనా! నీ విమల పాదపద్మములకు
భక్తి చేయుచున్నాడ వందనంబు.

శ్రీరా—అంగదా! నీకు శుభంబగుగాక, రమ్ము, కూర్చుండుము.

సీ. మానక వా నామమంత్రంబు పఠియించు
వాయునందనునకు భద్రమగునె?
మైత్రియొనర్చి మామాటపాలించిన
సుగ్రీవరేనికి శుభమునగునె?
వృద్ధుడయ్యును నన్ను బ్రీతిసేవించెడు
జాంబవంతుడు గూడ సౌఖ్యమగునె?
వీరసంగ్రామమునందు ధీరతజూపి పే
ర్గొన్న కపీంద్రులు కుశలమగునె?
గీ. సిద్ధగుణమూర్తి వగునీకు సేమమగునె?
వారు, వీరననేల నా భక్తులెల్ల
హాయినుండిరే? దుశ్చింత బాయగలరె?
అంగదా! దెల్పుమీ విషయంబులెల్ల.

అంగ—శ్రీరామచంద్రప్రభూ! మీ దయయున్నంతకాలము మాకే యుపద్రవములుండవుగదా? అందరముక్షేమముననే యున్నాము.

లక్ష్మ—ఇపుడు నీ రాక కిష్కింధ నుండియా? రామేశ్వరము నుండియా?

అంగ—రామేశ్వరమునుండియే. ఆంజనేయచూతనై వచ్చితిని.

శ్రీరా—మంచిది. మారుతిసందేశమేమి?

అంగ—దేవరవారు యాయతీ నరేంద్రుని చంపదలంచినారట.

శ్రీరా—ఔను.

లక్ష్మ—అది మాగురువుగారి యాన.

భర—గాధేయుని యయాతి పరిభవించెనట.

శత్రు—మునీంద్రుని కిచ్చినమాట మీరరాదు.

అంగ—కావచ్చును. గురుడైనను, సురగురుడైనను న్యాయ మరయవలదా? తండ్రియైనను విషముచేతికందించి ద్రావుమన్నత్రాగుదురా? వధ్యుని వధించుటకు మున్ను నేరమును విచారింపబనిలేదా?

శ్రీరా—ఆవిషయంబు లన్నియు మాకుతెలియును.

లక్ష్మ—ఇంతకు నీరాయబార మేమి ?

అంగ—మనవిచేయుదును. తరువాత సౌమిత్రియు, నా యయాతియు కాశీనగరంబునుండి కోసలకుం బయనమై వచ్చుచుండ, తీవ్రవాయు సహితవర్షంబున, మార్గమధ్యంబున విడిపోయిరట, నిజమేనా ?

లక్ష్మ—నిజమే. తరువాత ?

అంగ—తరువాత నాయయాతి "లక్ష్మణా! లక్ష్మణా!" అనిపిలుచుచు, వెదకుచు; నందందుతిరిగి, తుదకు అంజనీదేవి యుండుచోటునకుం జేరెనట. అంతనాతల్లి, ఆర్తనాదము వినిన వైపునకుంజూచి, యెలుగెత్తిబిలువ నాతం డామెనుచూచి నమస్కరించె.

భర—అటులనా ?

శత్రు—ఆ తరువాత ?

అంగ—తనకు నమస్కరించిన వానిం సంబోధించి "అయ్యా! తామెవ్వరు ? ఇందిటులు విచారంబున దిరుగుటకు కారణమేమి ?" అని ప్రశ్నించె.

శ్రీరా—దానికేమి ? అదిలోకధర్మమే.

అంగ—యయాతి మనో విచారంబున నేమియు చెప్పనొల్లక "నే నొక మంద భాగ్యుడను తల్లీ! నా దీన చరిత్ర నీ కెందులక" నియె.

లక్ష్మ—అనవచ్చును.

అంగ — సహజ కరుణాలోలయగు అంజనీదేవి వెండియు "నాయనా ! భయమందకు! నీ విపత్తు నివారణ కాగలదని దీవించెనట. అంతటను నా యయాతి విరక్తిభావంబును వీడకయె, "అమ్మా ! నీ కెందులకు వృథా ప్రయాస ; మరణింపనున్న నా కింక కోరదగినదిలేదు- నన్ను కాపాడువాడునులేడు. నా మార్గమున నే బోయెదన"ని వాపోవ, నంజనియే వానిం బిలిచి- "ఏమి ? నావద్దకువచ్చి చింతించుచు పోయెదవా!

వీలుపడదు. నిరంతర శ్రీరామనామ స్మరణాలోలుండగు నా కుమారునితో చెప్పి నిన్ను రక్షించెదన”ని కంకణంబు గట్టుకొనియె.

శ్రీరా—పాపము, ఆమెకుమాత్ర మేమి తెలియును ?

అంగ—తెలియకనే రామచంద్రా ! తెలిసియుండిన మీ చర్యను వ్యతిరేకింతుమా ? అసంభవము.

శ్రీరా—అగుగాక, కడమనేమయ్యె ?

అంగ—అంత కొంత తడవున కాంజనేయుండు రాగ నంజనీదేవి “కుమారా ! వీని కభయమిచ్చి రక్షింపు మ”నుటంజేసి మారుతి శర ణొసంగె. తదనంతరంబున గాధేయ ప్రతిజ్ఞా విధానంబును, మీ శపథంబు నాలించి కడుంగడు చింతించితిమి.

లక్ష్మ—మునివాక్పాలనార్థమై మేమాతని వధింప నున్న వార్త మీకు తెలియునుగదా ?

అంగ—తెలియుట చేతనేగదా, మిమ్ము క్షమాభిక్ష నర్థింప వచ్చితిమి.

భర—తెలియక చేసిన తప్పును— తెలిసి సవరించు కొనుట యుత్తమ లక్షణము గదా !

అంగ—ఔను.

శత్రు—తెలియక యయాతికి శరణొసంగితిరి. తెలిసి వానిని పరిత్యజించుటకు మీరిచ్ఛగించి నటులేనా ?

అంగ—శరణొసంగి పరిత్యజించుటకంటె దూష్యమెందును లేదు.

గీ. నిండు లేమిచే నెటులైన నుండవచ్చు;
వ్యాధి బాధలతో నెట్లొ బ్రతుకవచ్చు;
అంగవైకల్యమున దిరుగాడవచ్చు
శరణిడి, విడుటకన్న నీచంబు గలదె ?

కావున మారుతి కంఠంబున ప్రాణంబులుండ మాటయిచ్చి తప్పుట జరుగని కార్యము. రామచంద్రప్రభూ ! ఏకారణంబున నేని మారుతియే

యయాతిని త్యజించు తలంపుననున్న "ఛీ! ఛీ! ఆంజనేయా! నా భక్తుడ వయ్యు యెట్టి యవినీతి కార్య మాచరించితి" వని మందలింప దగిన మీరే ఇటు లాడదగునా?

ఉ. నేయము గోరువారి, నిరసింతువటయ్య? మహాత్ము లిట్టి య
న్యాయ కృతంబులన్ సలుపుమంచు వచింపగ చెల్లునయ్య? గా
ధేయుని పంతమే పగిది దివ్యకృతంబగునయ్య? యింక మా
నాయకు డాడినట్టి వచనంబుల కూరిమి నాలకింపుమా!

శ్రీరా—ఏమనియె?

అంగ—ఏలినవా రనుగ్రహింపవలయును.

సీ. కాశీవిభుం డలగాధేయునకు, దోషి
కాడంచు పలుమారు వేడుమనియె;
నిర్దోషిని వధింప నీవంటి వారికి
భావ్యంబు గాదని పలుకుమనియె;
ఆంజనీ సుతునిపై యనురాగముననేని
భక్తుని పాలింప పాడియనియె;
కపులకు; మీకును గల్గిన చెలిమైన
నెదలోన నొకమారు నెంచుమనియె;

గీ. సంధి నేక్రియనైన నను సలుపుమనియె;
నీతిమార్గంబు ధాత్రిపై నిలుపుమనియె;
చేయు మా ప్రార్థనలచెవి జేర్పుమనియె;
మానితముగ మిమ్మెప్పుడు మరువమనియె.

లక్ష్మ—ఇంతకు నీ రాయబార సారాంశమేమి?

భర—మీ ప్రతిజ్ఞా విధానంబు నుపసంహారము చేసుకొనుడని హనుమంతుని సందేశము—అంగదుని రాయబారము.

శ్రీరా—అంతియేనా?

అంగ—పూజ్యు లపార్థము చేసికొనరాదు.

శ్రీరా—అంగదా! అంజనేయుడు నా భక్తుడు. భక్తుడు భగవాను దేదికోరినను సమర్పింప దగినవాడు. నేను యయాతిని కోరితినిగాన, మాటాడక వానిని గొనిరమ్మని చెప్పుము.

అంగ—చిత్తము. భక్తు డొకప్పుడు ప్రమాదంబున దోషము సేయుచుండినను, భగవానుడు సర్వసమవర్తి—ఆపద్బాంధవుడు—కరుణామయుడు—క్షమాగుణ సంపన్నుడు, భక్తుని కోర్కెలను దీర్చువాడుగాన, మీరే మారుతి కోరికను మన్నించదగినవారు.

శ్రీరా—భక్తుడు, దైవాజ్ఞాబద్ధుడు.

అంగ—ధర్మము దైవస్వరూపము—ఆర్తత్రాణ పరాయణత్వముతో గూడిన సత్యవాక్పాలనయే దైవాజ్ఞ. అట్టి దైవస్వరూపులగు మీ కరుణ కొరకే ప్రార్థించుచున్నాము.

లక్ష్మ—వాలినందనా! మీరు శరణొసంగి తప్పుట దూష్యమనియే గదా రామచంద్రుని ప్రార్థించుట? — మమ్ము ప్రతిఘటించుటయును?

అంగ—కాదనజాలను.

భర—మేమును విశ్వామిత్రున కిచ్చిన వాగ్దానమును కాపాడుకొన వలదా? మీపాటి సత్యశీలము మాకు లేదనుకొంటివా?

శత్రు—వానరులకు గల ధర్మవర్తనము నరులకు లేదనిపించ వలయుననియా మీ యభిప్రాయము?

శ్రీరా—భక్తుడగు వాయునందనుడు తల్లిపరువును గాపాడెగాని, శ్రీరాముడు మాత్రము గురువుకీర్తిని కాపాడలేకపోయె ననిపించుటకే నాంజనేయుం డింతటి కయ్యంబున కొడికట్టె.

అంగ—అట్టి దురభిప్రాయంబులు మాకేనాడును లేవు, రామచంద్ర ప్రభూ! మము క్రొత్తగ భావించుచుంటిరేమి?

సీ. రావణాసురునితో రణమొనరింపగా
కడలిపై సేతువు గట్టునాడు;
పాతాళమున మీకు ప్రాణదానము సేయ
తెగువతో వెంట నేతెంచునాడు;

సౌమిత్రి మూర్ఛిల్ల సౌఖ్యంబు విడనాడి
ప్రతికింపగా పాట్లు బడిననాడు;
ప్రాణాలను తెగించి, పవరంబు గావించి
కొదువలేని జయంబు గూర్చునాడు;

గీ. ఎదురు చెప్పక తలవంచి యేగునాడు
వానరులు నీతిబద్ధులై వరలినారు;
యిపుడు మాత్రంబు దుర్నీతి నెసగినారె
కపులు దుర్మదాంధులు కారు క్ష్మాతలేంద్ర!

శ్రీరా—కపులు దుర్మదాంధులు కాదనినచో మేమా?

లక్ష్మ—పూజ్యులను నిందించువారు దుర్మదాంధులో, కారో యోచించగల వారికి తెలియక పోదు.

అంగ—మీరు దలంచిన భావము నా హృదయంబున మాత్రము లేదు. ఒకవేళ నేను మాటాడుటయందా యర్థ ముదయించెనేని తప్పును మన్నింపుము.

శత్ర—యయాతిని విడిచినచో మన్నించుటకేమి?

అంగ—ఐన; నది మా దురదృష్టమన్నమాట.

భర—అటు లనిన యుద్దమునకే సిద్ధపడెదరా?

అంగ—యుద్ధ మొనరింప వలయునను సిద్ధాంతము మాకు లేదు.

లక్ష్మ—యయాతిని విడువరాదన్న సిద్ధాంత మున్నదా?

అంగ—అది యైనను న్యాయమగుటచేతనే.

శ్రీరా—అంగదా! ఇంక నీ వితండవాదము సేయకుము. నీవు పోయి మారుతితో నా మాటలుగ యిట్లు చెప్పుము.

సీ. ముందు విశ్వామిత్రమునికి వాగ్దానంబు
నేను చేసినమాట నిక్కువంబు;
గురువర్యుని మతంబు గురిదప్పకుంటయే
శిష్యులకెల్ల ప్రసిద్ధ పథము;

తప్పుచేసినవాని దండింపనగుగాని
కరుణింప నీతిమార్గంబుకాదు;
ప్రతిఫలాపేక్ష నావంతలేకయే నల్పు
నట్టిదానికి పాప మంటబోదు;

గీ. మాటపట్టింపు లికనైన మానునేని
మనకు మనకున్న మైత్రియే మారకుండు
కాదయేని రమ్మనుమింక కయ్యమునకు
వట్టి బూటకంబుల నిందు గట్టిపెట్టు.

అంగ—ఇది యేసిద్ధాంతమా ?

శ్రీరా—ఔను.

అంగ—ఐన నేనింక బోయివచ్చెద.

శ్రీరా—మీ యిష్టము.

అంగ—మహానుభావా !

చ. పదములనంటి వేడితిమి భక్తుల నేలగ మమ్ము; మీరలున్
కదనము సేతుమంచు నిజకార్యము జూపితి రేమిసేతు మీ
యదనున ధర్మబద్ధమగు నాహవమాడుటకే తలొగ్గినా
ము, దయ ననుజ్ఞనిండు, కపిమూకను గాచుడు, పోయివచ్చెదన్.

లక్ష్మ—ఓయీ ! అంగదా ! యుద్ధమేనియు నొనరింతుముగాని యయాతిని విడువమనిచెప్పి బోవుచున్నావు. అటులయిన యిటు వినుము.

చ. విడువడు రామచంద్ర పృధివీపతి మీ కపిమూక నెల్ల నీ
పుడమి బడంగ గూల్చుతరి మొత్తాయటంచును యేడ్చుగాక నొ
క్కడు వినబోడు నీ పలుకు కయ్యము కయ్యమటంచు రాముపై
దుడుకుతనంబు జూపుట, యేదో యొకకీడు ఘటించియేగదా ?

కావున నా కడసారిమాట లాలకింపుము.

గీ. క్రొత్తవారలుగారు మా గొప్ప దెలుప
రావణుం డంతవాడును రణమునందు

రాము నెదిరించి చచ్చి స్వర్గముననుండె
వనచరులు మీరనగ నెంతవార లింక ?

కావున నా హితమాలకించి సంధివచనంబులు మార్చుకొనుట మన యుభయులకును క్షేమకరము.

చ. గడచినదానికై వగవగా బనిలేదు నిజంబు, మీర లి
ప్పుడయిన నా యయాతిని ప్రమోదముతోడుత వీడిపుచ్చియే
నడచిన మేలుగల్గు; వ్యసనంబు హరించు-ముదంబు మించు, మా
నుడువులు వేఫలించు నిది నూనతగా దలపోయ నేటికిన్ ?

అయ్యా ! సౌమిత్రీ ! నూరుమాటలేల ? మా ఆంజనేయుండు యయాతిని త్యజించుటమాత్రము కల్ల.

భర—ఆఁ ! ఏమంటివి ? ఆంజనేయు డాతనిని విడువడా ? సరే.

గీ. మీ సమీరపుత్రునికింక మేము కావ
లయునొ ? ఆ యయాతిపతి కావలయునో, ని
జంబు దేల్చుకొనుమనుము, సంగరంబొ ?
దాశరథితోడ హితమొ ? యీ తరుణమందు.

శత్రు—ఓయీ! యుద్ధముమాట తలపెట్టినచో మేము భయపడుదు మనుకొంటివాయేమి ? నీ యుపాయంబుల కీ నృపనందనులు జడియువారు కారని బాగుగ నెరుంగుము.

గీ. భీకరులునైన దైత్యుల పీడమడచి
విజయసిద్ధి గైకొన్న భూవిభు డితండు
ముగ్గురనుజులమును యుద్ధభూమి నుండ
పరులు గెల్వంగ సుంతైన వశముగాదు.

అంగ—అయ్యా ! యుద్ధంబున జయాపజయంబులు దైవాధీనంబులు. అదియుమంగాక మాకు మిమ్ము జయించవలయునను భావమేలేదు. మే మా యయాతి కిచ్చిన వాగ్దానము ననుసరించి మాకంఠంబున ప్రాణంబులుండు వరకు వానిని కాపాడుటయే కావలయును.

శ్రీరా——అటులైన నీ వింకబోయి యుద్ధమే సిద్ధమనిచెప్పుము.

అం —చిత్తము.——

(నిష్క్రమించును.)

శ్రీరా——సోదరులారా :

చ. అంగద రాయబారమున నా పవ నాత్మజు నిశ్చయంబు స
ర్వాంగ మెరుంగ జాలితిమి, వానరకోటిని సైత మింకపై
సంగరమందునన్ దునుము సాహసమున్ మది//గ్గె; నేటి కీ
భంగము గల్గునంచు పొరపాటుగనైన దలంచి యుంటిమే ?

సతి, కానిండు, అందులకు మనమేమి చేయగలము ?

ఆ. వె. నాడు నిద్రజెంద నాల్గవ ఝామున
కన్నకలయె యింతకథకు నాంది:
యిప్పు డింతయయ్యె యింకెంత మారునొ
చెప్పగలమె ? విధిని తప్పగలమె ?

నామనంబు మరింత వ్యాకులతగ మన్నందున నేటికింక సభను ముగింతము——



ఓమ్

# శ్రీ రామాంజనేయ యుద్ధము

## షష్ఠమాంకము

(రామేశ్వరంబున ఆంజనేయుడు, సుగ్రీవుడును కూర్చుండి యుండ తెర లేచును.)

ఆంజ—సుగ్రీవ మహారాజా! అయోధ్య కేగిన మన అంగదు డింకను రాడేమి చెప్పుమా!

సుగ్రీ—సంధివచనంబు లింకను జరుగుచుండె నేమొ?

ఆంజ—నా మనంబు యెందులకో సందియ మందుచునే యున్నది. శ్రీరాముడు నా వేడికోలు మన్నించునో? మన్నింపడో?

సుగ్రీ—తప్పక మన్నింపగలడు. ఆంజనేయా! దాశరది నిన్ను మన్నించుట కెన్నియో కారణంబులు గలవు.

గీ. సఖుడ వా రామునకు ప్రాణసముడ వీవు
నిన్ను మించిన బందుగు లున్నవారె?
నీదు ప్రార్ధన లింక మన్నింప డనుచు
నాత్మ శంకియ మేల నో యాంజనేయ!

ఆంజ—మహరాజా! మీరు వచించిన దంతయు యదార్ధము. ఐనను నాహృదయంబేలకో స్వస్తత నొంద కున్నది.

చ. అది యిదియంచు చెప్పుటకునై యొకరీతిని దోచకుండె నా
హృదయము నందదేమొ భయమేర్పడి గగ్గురుపాటు బుట్టు బో
మదికి దృఢంబు దెచ్చుకొని మాటికి మాటికి నోర్చుచుంటి, నం
గదుని ముఖంబునన్ దెలియగావలె దీని ఫలం బదేమియో?

ఆఁ ! సమయంబున కంగదుడును వచ్చుచున్నాడు.

(అంగదుడు ప్రవేశము.)

అంగ—జయము జయము, వాయు నందనులకు.

ఆంజ— అంగదా ! రమ్మ. నీ వాక్యము సంతోషమును, వదనము సంతాపమును దెలుపు చున్నవి. కారణమేమి ?

గీ. అట నయోధ్యలో మన వారలందరు కుశ
లంబె ? రాముఁడు నిను గారవంబున గనె
నే? మదీయ సంధియు వినినే ? యయాతి
పై పగదొలంగెనే ? వేగబలుకుమయ్య !

అంగ—ఆంజనేయా ! వారందరును క్షేమముగనే యున్నారు. మన యందరి క్షేమ సమాచారంబు లమిత శ్రద్ధాభిమానములతో విచారించినారు.

సుగ్రీ—అందు లోపమునేయరని మాకు బాగుగ తెలియును. ఇంతకును మనకిపుడు కావలసినది కార్యసాధనముగాని గౌరవమర్యాదలు కావు గదా ? పోయినపని యేమయ్యె ?

అంగ—అగుటకే మున్నది ? ఒక్కొక్కపుడు ధర్మ ప్రభువులు దారుణ కృత్యములందే కృతనిశ్చయులై యుందురు.

ఆంజ—అనగ వారు మనసంధి నంగీకరింప లేదన్న మాట.

అంగ —అనియే మనవిచేయుచున్నాను.

ఆంజ—అకటా ! ఇకనేమి కర్తవ్యము ?

సుగ్రీ—యుద్ధమే శరణ్యమా ?

అంగ—శ్రీరాముడు మనతో యుద్ధ మొనరించుటకేని సిద్ధమయ్యెనుగాని, విశ్వామిత్రుని కిచ్చిన వాగ్దానము మీరకుండె.

ఆంజ—నా సందేశమంతయు వినరించితివా ?

అంగ—అంజనీ పుత్రా! వివరింప కుందునా? మీరు వచించిన మాటలేగాక నా శక్తివంచనయు లేకుండ ప్రార్థించితిని—మీదుమిక్కిలి ధర్మనిర్ణయంబులు గావించితిని. ఐననేమి? ఎంతవేడుకొనినను "యయాతిని పరిత్యజింపుడ"ను మాటదప్ప మరొక టనకుండిరి.

ఉ. పాదములంటి వేడితి: కృపన్ గనుమంచు నమస్కరించితిన్
వాదులులేక మమ్ము పరిపాలన నేయుమటంచు కోరి మా
పై దయజూపుమన్న; నలపంక్తి రథాత్మజు డొప్పడయ్యె తా
నేదియొ కారణంబు వచియించుచు నుండె నికేమి నేయుదున్?

అంజ—అకటా: నా రామునితోడనా సంగర మొనరించుట? అసంభవము. అసంభవము.

(తెరలో) వనచరులారా! అంజనేయు డెక్కడ?

సుగ్రీ—అడుగో, లక్ష్మణుడు వచ్చుచున్నాడు.

అంజ—(బిగ్గరగ) సౌమిత్రీ! మందభాగ్యుడగు మారుతాత్మజు డిందే యున్నాడు. దయనేయుము.

(లక్ష్మణుడు ప్రవేశము)

అంజ—లక్ష్మణా! వచ్చితివా తండ్రీ!

గీ. కడిగి రామ పట్టాభిషేకంబు నందు
చూచినాడ నిన్ను, మొగము వాచినట్లు
మరల నేడు చూచితినయ్య! మారుతియు క
నబడెనేమి, యీ కతన నిన్నాళ్ల కిచట.

లక్ష్మ—అందులకై యిట్లు చేసితి వన్నమాట?

అంజ—నే నేమియు చేయలేదు స్వామీ! నా స్వామి రామచంద్ర మూర్తి చరణారవిందముల గొల్చుటకన్న నితర లోకంబుతో పనిలేని యీ హనుమంతు డేమి చేయగలడు? అంతయు మీ చల్లదనంబే దేవా!

సీ. కాలవశంబున కల్గినదే కాని
కపటంబు నాలోన గలుగదంటి;
మాతృ నానతికయ్యు మమత నొందితి గాని
వాదంబు లాడంగ కాదనంటి;
మ్రొక్కెదము దయనుబ్రోవు మంటిని గాని
యెదిరించి బల్కుట నెరుగమంటి;
కపులెల్ల మీ భృత్యగణమై వరలుగాని
చీలి పోరాటంబు సేయరంటి;

గీ. జరిగిపోయిన తప్పును సైచుమంటి;
యిల యయాతిని నెట్టులునైన నేలుమంటి;
దేవదేవులు మీరంటి, దీనజనుల
గావుమంటి, మీకిదె నమస్కారమంటి.

లక్ష్మ—ఓయీ మా సూర్యవంశంబునలేని యసత్యా మహాదోసంబు ప్రాప్తించుచుండ మేమద్దానిని బాపుకొనవలదా ? మా శత్రువునకీవు నభయం బొసంగి, అందుమూలమున మా ప్రతిజ్ఞాభంగము సేయదలంచు టయేగాక, నీ ప్రార్థనల వినలేరనియు మాపై నిందమోపుచుంటివిగా !

ఆంజ—మీపై నిందమోపుటకు నే నెంతవాడను దేవా !

లక్ష్మ—ఎంతవాడవు గాకున్న నింతపని చేయుదువా ?

సీ, వెనుక ముందుల చూపు వీక్షింపబోవకే
అభయప్రదాన మీయంగ గలవె ?
తొలుత చేసినదెల్ల దోషమం చెరిగియు
దిట్టవగుచు పట్టు పట్టగలవె ?
రాముని మర్యాద రచ్చలో బెట్టంగ
కాని సంధి నొనర్ప బూనగలవె ?
కడకైన మామాట గౌరవ ముంచక
గద ధరియించియు గ్రాలగలవె ?

గీ. గతము విడనాటి చివరకీ గడియనైన
నీతిలేక యుద్ధంబున నిలువగలవె ?
మాట లొక విధంబు, మనసు మరొక విధము
నై ; మెలంగుదువే నీవు నాంజనేయ !

సుగ్రీ—సౌమిత్రీ ! ఎందులకీ వైరంబులాడవలయును ? ఆంజనే యుండు రామలక్ష్మణులయం దెట్టి ప్రవర్తనగలవాడొ నీ వెరుంగకుంటివా? నే నెరుంగకుంటినా ? ఈ లోక మెరుంగకుండెనా ?

సీ. నూరుయోజనముల వారిధి నటుదాటి
సీతమ్మ వార్తల చెప్పెనెవడు ?
కుంభకర్ణునినాడు కూల్పవలయునన్న
నీకు సహాయమై నెగడె నెవడు ?
మైరావణునిముందు మరణింప నుండిన
మిము గాపాడిన మేటియెవడు ?
మూర్ఛనందున నీవు మునిగియుండంగ సం
జీవిదెచ్చిన జగజ్జెట్టి యెవడు ?

గీ. యిన్నిచేసిన మారుతి యిపుడుమీకు
కాని వాడయ్యెనే స్వల్పకార్యమందు
నాటి మంచితనమునెల్ల వీటబుచ్చి
పల్కినాడవు నిష్ఠుర పలుకులౌర !

లక్ష్మ—సుగ్రీవా ! అక్కర దీరినంత తొల్లిటి విషయంబును మరచిపోయితివా యేమి ? ఒక్కమారు వెనుకకు తిరిగి చూచుకొమ్ము.

ఉ. అన్నకుజంకి, పర్వతగుహాదుల నుండినవేళ "రామ ! ఆ
పన్నుడ గావుమయ్య" అని ప్రార్థనచేసిన నాటి మాట లిం
కన్నియు నేటికిట్లు మరుపయ్యెనె ? వాలివిజంపి రాజ్య మీ
కున్నపుడందు గానబడకున్నదె రాముని మేలు వానరా !

సుగ్రీ— రామానుజా! తీగె కదిలించిన డొంకంతయు కదలును. జరిగిపోయినవాటి యెందెంతదను కావశ్యములగునో, అంతవరకే మాటాడుట మంచిది. కావున తగురీతి భాషింపుము.

లక్ష్మ—ఏమీ, మాటలాడు వైఖరిని మాకే చెప్పుచుంటివిగా?

సుగ్రీ—నాడు మీ రేస్థితియందుంటిరో జ్ఞప్తియందున్న మీరిట్లు మాటాడువారుకారు— మీకు మాటలాడు వైఖరిని మేము చెప్పువారమును కాకపోయి యుండెడివారమే. రామానుజా!

ఉ. ఆలిని దైత్యనాధుడు బలాధికుడై గొనిపోవ; ధైర్యమే
చాలనివారలై, కపులసాయముగోరగ వచ్చినట్టి యా
కాలము దీరిపోయెనని, గాదె యిటుల్ మము బల్కులాడుటల్;
చాలును చాలునింక కడుసంతసమయ్యె త్వదీయవాక్యముల్.

లక్ష్మ— కిష్కింధపురాధీశా! పొరబడుచున్నావు. మా అన్నకును నీకునుగల తారతమ్యము నీకింకను తెలియనేలేదా? ఐన వినుము.

సీ. రావణాసురుడు చోరత్వంబుతో సీత
నపహరించె కడు మాయావియగుచు
నిన్నెదిరించియే వాలి నీ భార్యను
చేపట్టె ధైర్యంబు చెదరకుండ;
పగర నన్వేషింప పయనించుచుంటిమి
వీరులమై పట్టు విడువబోక
కన్నీరుబెట్టుచు గతిలేక ఋష్యమూ
కాద్రిపై పడియుంటివపుడు నీవు;

గీ. మా వదినె శీలమింతయు మారలేదు;
కలుషమయ్యె నీ సతి వాలి కామలీల;
నిందకై వీడె మా యన్న నెలతనైన;
యేలుకొంటివి పతితయౌ యింతినీవు.

ఇంకను సిగ్గులేక మమ్మాక్షేపించుచుంటివా?

అంగ — ఔనౌను. ఆక్షేపణ పొందగలిగిన వారెవరో మాకు బాగుగా తెలియును.

గీ. అన్న వెంటబడి, యడవులన్ని దిరిగి
తిండితిప్పలుగూడ లేకుండమాడి
సేవకావృత్తి జీవించు నీవు మేల
మాడవలెనే సుగ్రీవుని కీడురాక.

లక్ష్మ—నిజము. అంగదా! నిజము. మీ చిన్నాయనకు నేను సాటివత్తునా? ఎటులేనియు, అన్న కుమారుడవు నీవు సాటివత్తువు గాని;

ఆ. వె. తండ్రిని వధియించి; తన రాజ్య మార్జించి
పృధివి నేలుచున్న పిన్నతండ్రి
కాళ్ళవద్ద బ్రతుకు ఘనుడవు నీ వాక్ప్ర-
ప్రౌఢశాలి గతిని పల్కు-దేల?

అంగ—ఆ విషయంబునకు వచ్చినచో మా తండ్రిని చంపిన మాయోపాయములు మీరెగదా? చెట్టుచాటుననుండి గురిచూచి కొట్టుటయు నొక వీరలక్షణమేనా? ఆడి పలుకుట ధర్మవిరుద్ధంబని నిర్దోషిని చంపుటకు చూపిన యీ నీతివర్తనము వాలిని సంహరించునా డేమైనది?

సీ. పాపకార్యమటంచు భావమందున లేక
నాడుదానిని దునుమాడు నపుడు;
వాలితో పోరాడి వధియింప జాలక
పొంచి దొంగతనాన బోరునపుడు:
కదనధర్మము మీరి గర్భంబుపై కొట్టి
దశకంఠుని వధింప దనరునపుడు;
కల్లు ద్రావినవాని కైపుకూతల కోడి
యర్ధాంగి నడవుల కనుపు నపుడు;

గీ. మాయమై పోయెనేమి ధర్మ మనుమాట
భక్తుడగు యయాతిని జంపవచ్చి బడియె

మాసిపోయినే ధర్మంపుమాట నేడు
పవనసూతి కీరితి గంగపాలు సేయ.

లక్ష్మ—ఓయీ ! అవినయగుణచరిత్రా ! అపవిత్రా ! నీకు గలుగు నీ కొంచెపు వివేకముతోడ రామమూర్తినే విమర్శించుచుంటివిగా ! రమ్ము. దాశరథిని నిందింప బూనిన నిన్నిదే సంహరించెద. (విల్లు ధరించును.)

ఆంజ—ఆఁ ! ఆ ! సౌమిత్రీ ! ఆగుమాగుము. సమర మాచరించెడుపట్ల నా పసివానితో నేమిపని ? నేనున్నాను యిటురమ్ము.

లక్ష్మ—ఆంజనేయా ! నీవైనను నాతో పోరాడగలవా ?

ఆంజ—పోరలేనిచో నేమిచేయమంటివి ?

లక్ష్మ—యయాతిని విడువు మంటిని.

ఆంజ—మీరు ప్రతిన విడిచిన వెంటనే నేను యయాతిని విడుతును.

లక్ష్మ—అటులైన యుద్ధ మొనర్చెదవా ?

ఆంజ—మీరాజ్ఞాపించినచో.

లక్ష్మ—లేకున్న ?

ఆంజ—నన్నును, నాశరణార్థిని రక్షించితిరని భావింతును.

లక్ష్మ—అదిమాత్రము జరుగదు.

ఆంజ—సరి కానిండు.

లక్ష్మ—ఐన యుద్ధమునకు రమ్ము.

ఆంజ—చిత్తము.

(ఇరువురు కొంతసేపు యుద్ధము సేయుదురు.)

లక్ష్మ—ఆంజనేయా ! నీవు చిరంజీవినని దలంచుచుంటివేమొ ?

ఆంజ—మీరు శ్రీరాముని తమ్ముడనని దలంచుట లేదుగదా ?

లక్ష్మ—ఆఁ ఏమి ? ఇంకను నీపట్టుదల విడువవైతివిగా ?

ఆంజ—అటులైన కాచుకొమ్ము. (అస్త్రమును సంధించును.)

లక్ష్మ— హా! (మూర్ఛిల్లును.)

ఆంజ—(గదనావల పారవైచి) హా! సుమిత్రా కుమారా! ఊర్మిళా మనోహరా! మరణించితివా, తండ్రీ!

చ. అనవరతంబు దైవమను చాత్మదలంచి భజించుచుంటినే
యనఘుని పాదపద్మముల, నా రఘురాముని సోదరుండు ల
క్ష్మణునికి దూరమైతి, మతిమాలిన కోపమునందు, నింక రా
ముని కెటు దెల్పువాడ, మరి మోమెటు చూచెడివాడనో గదా?

ఓ పాపిష్టికాలమా! ఎంతపని చేసితివి? దైవమా! నా లక్ష్మణుని చంపుకొనిన తరువాత నే నెందులకు? ఈనిష్కారణ సంగరంబున నీతడే జీవించి నేను మడసినచో నొక్క నా తల్లికిమాత్రమే పుత్రశోకము కలిగె డిది, నేను జీవించి సౌమిత్రి గతించుటచే నెందరికో శోకము సంభవించె.

సీ. సీతావిభుండు విచ్చేసి "సోదరుడేడి"
యన్న; యేమని బదులాడువాడ?
అలసుమిత్రయే వచ్చి "యాత్మజు జూపుమ"
టన్న; నాతల్లి కే మనెడువాడ?
ఊర్మిళాదేవియే కూర్మి "నా విభుదేడి"
యన్న; యేమని బదులాడువాడ?
కోసల ప్రజలెల్ల కూడి "లక్ష్మణుడేడి"
యన్న; నవ్వారికే మనెడువాడ?
గీ. అర్ధరాతిరి సంజీవినైన దెచ్చి
నాడు రక్షించి నీదు ప్రాణాల నిలిపి
నట్టి చేతులతోడనే యిట్టులకట
చంపుకొంటినే సౌమిత్రి! సంగరమున.

సుగ్రీ:—(లక్ష్మణుని సమీపించి చూచి)హనుమా! విచారింపకుము. సౌమిత్రి మరణింపలేదు, మూర్ఛిలినాడు.

ఆంజ:—(సంతోషముతో) ఏమి, నాలక్ష్మణుడు మూర్ఛిల్లెనా? ఐన కొంతదనుక సంతోషమే. అంగదా! ఈవార్త వెంటనే రామునకు పంపుము.

అంగ:— అటులనే. మనస్థిమితమునకై నీవును విశ్రాంతి తీసుకొన రమ్ము. మన కపులు లక్ష్మణుని కనిపెట్టుకొని యుందురు.

(తెర వ్రాలును)



ఓమ్

# శ్రీ రామాంజనేయ యుద్ధము

## సప్తమాంకము

(శ్రీరాముడు—ఆంజనేయుడు ప్రవేశము.)

ఆంజ—రామా! రఘువంశసోమా! వందనములు.

శ్రీరా — ఆంజనేయా! నీవు సర్వస్వతంత్రుడ వైతివిగదా? నాకెందుల కింక వందనములు చేయవలయును?

ఆంజ—నేను స్వతంత్రుడనా దేవా!

శ్రీరా—కాకపోయిన నీ యభయ ప్రదానమేమి?—అంగదరాయ బారమేమి? సంగర క్రియోత్సాహము లేమి?

ఆంజ—మీ రెరుంగని దేమున్నది మహాత్మా!

గీ. ఆడితప్పని వాడనేనగుట; అభయ
మిచ్చి వెనుకాడ దూష్యమం చేనునమ్మి
యుంట; మీకుమనవిచేసి యుంటినయ్య?
మరలనను నిందవేయంగ మంచిగాదు.

శ్రీరా—ఆంజనేయా! ధర్మమునకు దేశకాల పాత్రల నరయుట ముఖ్యము. నేడు విశ్వామిత్రాగ్రహావేశంబునకు గురికాకుండనుండవలయు నన్న నేనును నీవునుగూడ యయాతిని వధింప దగినవారమే. మరియు నాహిత మాలకింపుము.

చ. గురుడగు గాధినందనుని కూరిమి గోరియెపూని తాటకిం
నరికితి యాగ పాలనకు నాడటు—నేడు యయాతి రేనినిన్
నరుకగ బూనియుంటిగద నాగురు నానతితోడ, నీకునే
గురువునుగాన నాహితముగోరుచె ధర్మమునీకు మారుతీ!

కావున నీకాధర్మ శాస్త్రములతో పనిలేదు. నా వచనంబు లాలకించి నీవీ యయాతిని వీడెదవేని నా యనురాగమునే గాక విశ్వామిత్రుని ప్రేమాభిమానంబులను గూడ పొందగలుగుదువు. గా ధే యు డ న సామాన్యు డనుకొంటివా ? ముందాతని వలన ధన్యతచెందిన వారెంద రుండిరో యెరుగవు కాబోలు. ఆ మహనీయు నెదిరించిన వారెన్ని యిక్కట్టు లొందిరో; ఆతం డెంతటి ప్రతిభాశాలియో నాలింపుము.

సీ. నలువ సృష్టికిమారు నవ్యసృష్టి యొనర్చి
జేజేలు సర్వదా చెందినాడు;
నర, సుర, మునులెల్ల నిరసించినతరి; త్రిశంకు
శంకు స్వర్గము నొందు సలిపినాడు;
మాన్యుడగు వశిష్ఠమౌని పుత్రులనెల్ల
రోసాన భస్మంబు చేసినాడు;
మాటవచ్చిన నెట్టి మహనీయునేనియు
రంపపుకోతల రాచినాడు;

గీ. అతడు సామాన్యుడనుకొంటె యాంజనేయ !
ఘన తపఃప్రభా కలితు డమ్మునివరుండు
గాధిరాట్పుత్రి కరుణయే గలుగునాడు
కొదువగలదె ? నీ కెంతయు ముదముగాదె ?

ఆంజ—రామచంద్రప్రభూ! నన్ను మన్నింపుము. నేడు మీ ధోరణి యంతయు క్రొత్తగ నున్నది. గాధేయుండు ప్రతిభాశాలియని;వాని పంతంబు నెరవేర్చుటయు, యయాతి సామాన్యుండని వాని వధించుటయు ధర్మవిరుద్ధముగ నున్నది. మా దైవమగు శ్రీరామచంద్రమూర్తి చెప్ప దగిన నీతు లివియేనా యవియు సందేహించుచున్నాను దేవా !

శ్రీరా—హనుమంతా ! నీవింతటి పంతంబులాడుదువని తలంప లేదుగదా !

ఆంజ—ప్రభువులతో పంతంబులాడుదునా ? నన్ను కాపాడుమని మీ పాదములంటి ప్రతిమిలాడుకొందును. (అని పాదములు దాకబోవును)

శ్రీరా—(రోషముతో) ఛీ! దుర్మార్గుడా! దూరముగ బొమ్ము. (తన్నును)

ఆంజ—ఆహా! దేవరవారి పాదతాడనచే నా జన్మ ధన్యమైనది; మహాత్మా!

సీ. అలపంక్తి రథరేని యంకసీమను, గజ్జె
లందెల నాట్యంబు నాడెనెద్ది?
రాతిగా బడియున్న నాతికి నిజరూపు
సత్కృపతోడ నొసంగెనెద్ది?
జనకభూపాలుండు కనకపళ్ళెరమందు
కన్నెనిచ్చెడువేళ కడిగెనెద్ది?
వనభూము లన్నింటి పావనములు సేయ
నడవుల కేతెంచ నడిచెనెద్ది?

గీ. అఘమయంబగు నాదు దేహంబు దాక
దోసదూరునిగా నన్ను జేసెనెద్ది
అట్టి మీ పాదపద్మంబు నమితభక్తి
నొత్తువాడ, పాలింపుమో యుత్తమాంగ!

శ్రీరా—ఓయీ! దుర్వినయధౌరేయా! ఆంజనేయా! సిగ్గులేక నీ విట్లు నా పాదమంటిన నంటుదువు గాని, నీ యట్టి విశ్వాసశూన్యచరిత్రుండు స్పృశించిన నాకు కళంక మాపాదించును సుమా.

ఆంజ—ఔను, ప్రభూ! నేను విశ్వాసశూన్యచరిత్రుండ నగుట చేతనే యయాతీ ప్రాణరక్షణకై లేనిపోని కయ్యంబు పెట్టుకొంటిని—నాకు ప్రత్యక్ష భగవత్స్వరూపులగు మిమ్మెదిరించి పోరాడ సాహసించితిని. ఐనను ఆంజనేయుం డిపుడు మీముందు సిగ్గు దెలియని దురభిమాని కావుననే నిలుచుండ సాహసించెను.

కం. అల సుగ్రీవునకు, తమకు
చెలిమొనరించి మరి మిమ్ము చేర్చినవా డీ

ఖలుడగు హనుమంతుండని
తెలియుము పంక్తి రథపుత్ర ! తేజోవంతా ;

మహాత్మా ! మారుతి మీకెట్టి యుపకారియో నేను వచింపనేల ? మీ కానాటి గాథలే జ్ఞప్తియందున్నచో నా యందింత పగవహింతురా ?

శ్రీరా—ఓయీ ! ఆత్మశ్లాఘ పారీణా ! నీవు మాకు చేసిన యుపకారములే నీకు జ్ఞప్తియున్నవి కాని, మేము చేసిన యుపకారములు జ్ఞప్తియందు లేవన్నమాట. ఔను కృతఘ్నుల విధాన మిట్లే యుండును.

గీ. కరుణ కిష్కింధపురిని సుగ్రీవున కిడ
మేము చేసిన యుపకృతు లేమియయ్యె ?
రాము నెదిరింప జాలిన ధీమసమున
మరచినాడవు కాబోలు మమ్మునెల్ల.

ఆంజ—ప్రభూ ! మరచిపోయినది మేముకాదు.

శ్రీరా—మరి నేనా ?

ఆంజ—అని నేననగలనా ?

శ్రీరా—మరి యేమంటివి ?

ఆంజ—మమ్ము కటాక్షింపు మంటిని—

శ్రీరా—ఆంజనేయా ? మాటలుచూడ మంచి తనమును; మనోభిప్రాయము జూడ మర్మభావమును దెలుపుచున్నవి. ఎన్నినాళ్లు మా చెలిమిచేసి యేమి ప్రయోజనము ? మీ కోతిజాతి స్వభావమును పోనివ్వవైతివని విచారించు చున్నాను.

ఆంజ—ఔను స్వామీ ! వానరులకున్న నీతి నరులకు లేక పోయెనే యని నేనును విచారించుచున్నాను. మీ చెలిమిచేసినంత మాత్రమున మీరు చేసిన పనులు చేయజాలుదుమా ? మీకు సాటి రాగలమా ?

సీ. ప్రేమించి వచ్చిన వెలది ముక్కు చెవులు
మాయచేసి; బిరాన కోయగలమె ?
యీడుమించినదాని యెంగిలి పండ్లైన
దొక్కశుద్ధిగ నిన్ని మెక్కగలమె ?

చెట్టుచాటున దాగి, చిన్ని బాణము నాటి
కోతివీరుని నేల గూల్పగలమె ?
తమ్ముని విడదీసి తగమర్మము నరసి
పగవారిబట్టి జంపంగ గలమె ?

గీ. నిరపరాధుల దెగటార్ప నేర్వగలమె ?
చేరువారల కడు నిరసింపగలమె ?
దిట్టతనమున పట్టు సాధింపగలమె ?
రామ ! మేము మీ నీతి నేర్వంగగలమె ?

శ్రీరా—ఓయీ ! కొఱకు మాలిన నూరు మాట లంటివిగాని ఇందు ప్రధానమైన గురుభక్తిని గురించి దెలుపవైతివేమి ?

ఆంజ—మీరు చూపునట్టి గురుభక్తి మాత్రము మాయందు లేక పోయినందున నా మాటలు పలుకకపోయితిని.

శ్రీరా—పోనీ, యింతకు నా యయాతిని విడిచెదవా ? లేదా ?

ఆంజ—విడువలేను దేవా ?

శ్రీరా—ఐనచో నాయుధంబును ధరింపుము.

ఆంజ—రామచంద్రునిమీదనా ? నా ప్రభువులవారి మీదనే నాయుధంబును ధరింతునా ? లేదు స్వామీ ! అది యీ దాసుడు చేయగల్గిన పని కాదు. నేను చేయజాలను.

శ్రీరా—ఐన యయాతిని విడువుము.

ఆంజ—అదియును జరుగరానిదియే.

శ్రీరా—మరెట్లు జరుగవలయును ?

ఆంజ—దేవరవారు కటాక్షింపవలయును ?

శ్రీరా—నిన్ను కరుణించుటకు—నీ శరణార్థిని వధించుటకు మేము సిద్ధముగనే యున్నాము.

ఆంజ—మీ రటు లాజ్ఞాపించిన నేనును నా శరణార్థితోబాటు మరణించుటకు సిద్ధముగ నున్నాను,

శ్రీరా—నీవేల మరణింపవలయు ?

ఆంజ—సత్యపాలనకు—స్వామికార్యమునకు.

శ్రీరా—అనగ ?

ఆంజ—దేవా! నేనా యయాతికి తొందరబడి శరణొసంగిన మాటయదార్థమే. కాని, అందొకమేలు మాత్రముజరిగినది. "నాకంఠంబున ప్రాణములుండ నిన్ను విడువ" నంటిని.

గీ. అతని కంటెను ముందు నే హతుడనైన
తదుపరి కథతో నాకేమి ధరణినాథ!
మొదటనను గూల్చి, కాశేంద్రు పిదప జంప
నీకు నాకును దోషంబు రాకపోవు.

కావున ముందు నన్నుజంపి కడమవానిం దెగవేయుడు.

గీ. కాయ మస్థిరమనుమాట కలదు జగతి
నిలిచి యుండున దొక్కటె నీతిగాన;
పవనసూతి సత్యమునకై ప్రభునికయ్యె
తనువు చాలించె ననుకీర్తి దక్కునాకు.

అందువలన దేవర వారికి శ్రమ చేకూర్పక యీ దేహంబును మీ పాదంబుల నుంచుచున్నాడ. సందేహింపక మీపని మీరు కానిండు. అందువలననాకును విశేష లాభంబులుగలవు.

గీ. ఆత్మనెంచిన కార్య మిట్లగుటెగాక
తమదుచేత మడిసిన ప్రాప్తమగుముక్తి
గురువు కార్యంబుదీర్చిన పరువునాకె
వచ్చుచున్నది—నీకేల మచ్చరంబు ?

శ్రీరా—ఆంజనేయా! నీవెంత ధర్మోపన్యాసంబులు వచించితివో; అంత అహంభావంబుగన్పడుచున్నది. అహంభావంబున సర్వ పుణ్యంబులు నమయునని నీవెరుంగకపోవు. కావున నిన్ను దెగవేయుటవలన పుణ్యమే కాని పాపంబురాదు.

ఆంజ___ఔను ప్రభూ! మీ పుణ్యంబధిక మగుటకేగదా నాశరీరంబు నేని సమర్పించుకొంటిని?

శ్రీరా___అటులైన నిదిగో, నీ బాణమును కాచుకొనుము. (బాణ మును విడుచును.)

ఆంజ___(నిమీలిత నేత్రుడై కరములు మోడ్చి.)

గీ. ఈశ్వరాంశ సంభూతుండనేని, ఆడి
తప్పనేని, శ్రీరామపదంబు లెపుడు
గొల్తునేని; విఖ్యాతికి నిల్తునేని
రాముశరము పూమాలయై గ్రాలుగాక.

(రాముడు విడిచిన బాణము పూలమాలగామారి ఆంజనేయుని కంఠమునందు బడును.)

శ్రీరా___(ఆశ్చర్యముగ) ఏమీవింత? ఆంజనేయా! ఈమారు కాచుకొమ్ము. (బాణము కన్నుల కద్దుకొని నిమీలిత నేత్రములతో)

గీ. ఏను దశరధ పుత్రుండనేని; జాన
కీ కళత్రుండనేని, సత్కీర్తి పరుడ
నేని, రాముడనేని, యీ బాణ మిపుడె
మించి వాయునందనుని వంచించుగాక.

(అని బాణమును విడుచును)

ఆంజ___హా! (మూర్ఛిల్లును)

శ్రీరా___అహా! ఆంజనేయా! మరణించితివా తండ్రీ! శర ణొసంగి తప్పననుచు సత్యవాక్పాలనకై ప్రాణంబులనే యొసంగితివా? నీవు చిరంజీవివై యుందువని భ్రాంతిపడితినే?___నాకు నీకంటె ప్రాణా ధికు లెందునూ లేరని శ్లాఘించితినే?___శ్రీరామాంజనేయుల పరస్పరాభి మానంబుల సాధారణంబులని గర్వించితినే?___నీ హృదయంబులో సర్వదా నేనుందునని వరమొసంగితినే? ఆ మాటలన్ని స్వప్నగత వృత్తాంతంబులను చేసి___ నన్నీదుఃఖ వారాసిలో ముంచి పోయితివా?

హనుమా ! నీవంటిభక్తుడు నా కింక నెన్ని జన్మములకు లభించునయ్యా ! ఏదీ ? ఒక్కసారి రామా అని పిలువవా ? నావైపు చూడవా ? నాపై పగ దలంచితివా ? అయ్యో ! దైవమా ! నన్నెట్టి దుర్గతిపాలు చేసితివి ? చివరకీ రాముని బ్రతు కెంత హీన పరచితివి ?

సీ. నిఖిల కోసలభూమినే వీడి వనముల
　　కేగుచో నీ చింత నెరుగనైతి;
జనకుండు మరణించెనని విన్నతరినైన
　　నీరీతి చింతించి యెరుగనైతి;
సౌమిత్రి నాడు మూర్ఛా పరవశుడైన
　　నింతగా చింతించి యెరుగనైతి;
జానకి నేనియు కానలకంపుచో
　　నీమాడ్కి చింతించి యెరుగనైతి;

గీ. ఎన్నడును నామనంబున నెరుగనట్టి
దుర్భర వియోగ మిపుడు నా గర్భసీమ
చేరి కల్లోల మెంతేని జేయుచుండె
మారు తిటు మరణించిన కారణమున.

ఓ దైవమా ! ఈ లోకంబున మున్నెన్నడేని నా యట్టి పాపాత్ముం డుదయించెనే ! ఔరా ! కాలమహిమ ? నా జీవితంబున ప్రశంశార్ణంబగు ఘట్టమొక్కటేనియు కనుపించదే ? నా పూర్వీకు లెట్టి యశోవిశాలురో నేనట్టి దుర్యశోవిశాలుండ నైతినిగదా ? ఓ బ్రహ్మదేవుడా ! నన్నింతటి మందభాగ్యుని జేసితివేమయ్యా ?

సీ. జనకుండు నను బాయజాలక "రామ ! రా
　　మా !" అని యల్లాడి యసువులుడిగె;
నా కుపకారియై జటాయువు ధరపై
　　కొనప్రాణములతోడ కూలి పడియె;
నావచనాల సుగ్రీవుండు వాలిచే
　　చావు దెబ్బలుతిని సాగిపోయె !

నన్ను సేవించిన నాతి జానకి గూడ
దిక్కుమాలి వనుల దిరుగవలసె;

గీ. భక్తుడు యయాతికిక ప్రాణభయము గూడె;
నీతిపరు డాంజనేయుండు నేలబడియె;
నన్నునమ్మి క్షేమంబుగా నున్నవారు
కనగరారై రిగద, ముజ్జగంబులందు.

ఎంత చింతించి యేమి ప్రయోజనము ? పోయినవారు తిరిగి వత్తురా ? నన్నోదార్తురా ? ఇట్టి తమ్ములను, భక్తులను చంపుకొన్న నేను మాత్రము జీవింపనేల ? ఓయీ ! యయాతీ ! ఎందుంటివిరా ? నీ మూలముననే నేడు మా కపి రఘుకులంబుల కీ గతి సంప్రాప్తించినది. ముందుగ నిన్ను జంపి నేనును మరణించెద రా రమ్ము.

ఆంజ——(మూర్ఛనుండి లేచి) రామభద్రా ! ఆగుమాగుము యయాతిని వధించుటకు హనుమంతు డింకను బ్రతికియే యున్నాఁడు.

శ్రీరా——(స్వగతమున) ఈతండు జీవించుటచే నానందమైనను, మొండిపట్టుదల విడువకుండుటచే యాగ్రహమగుచున్నది. (ప్రకాశముగ) వత్సా ! ఆంజనేయా ! ఒక్క మాట వినుము.

ఉ. తమ్ముని జంపుకొంటి, మఱి తమ్ముని యంతటివాడవీవు క్షే
మమ్ముగ లేమదాన, నసమాన ముదంబు ఘటించె నాకు, యు
ద్ధమ్మును సేయబోకు; పెడదారి దొలంగి యయాతి నింక శీ
ఘ్రమ్ముగ వీడిపుచ్చుము. సుఖంబగు నీకును వాయునందనా !

ఆంజ——రామా ! నా నిశ్చితంబును గూడ వినుము.

చ. దురమున లక్ష్మణున్ దునిమి దుష్టుడనైతి, కనంగ నాతదే
కరువగు కాలమందు బ్రతుకంగనదేటికి నేను, మిమ్ము సో
దర మరణైక శోకవిధి దన్పినపాపిని గాన చంపినన్
ధరణికి లోటురాదుగద, దాశరథీ! మఱి శంకలేటికిన్

శ్రీరా——ఇప్పటికిని యయాతిని విడువవా?

ఆంజ—విడువను.

శ్రీరా—ఐన నీసారి నాబాణమును కాచుకొనుము.(బాణము గురి చూచి నిమీలితనేత్రములతో) ఓ బ్రహ్మాస్త్రమా! మారుతీ శిరచ్ఛేదనంబును గావింపుము.

మ. ఇదిబ్రహ్మాస్త్రముసుమ్మి, మారుతి శిరంబీ వాలునస్ ద్రుంపగా
నదయస్వాంతము నొందుగాక, మునికార్యంబెల్ల గావింప స
మ్మదమై కాశిపురాధినాథు నిదె నిర్మూలించి నన్గావ రా
గదె గాధేయ పరాభవానలము నిక్కంబింక చల్లారగన్.

(అని బాణమును విడువబోవు సమయంబున విశ్వామిత్రుడు వచ్చి రాముని చెయ్యి పట్టుకొనును— రాముడు విదిలించుచు) నన్నింక వారింప కుడు— విడువుడు— విడువుడు.

విశ్వా—రామచంద్రా! నేను విశ్వామిత్రుడను. యయాతిని కటాక్షింపుము.

శ్రీరా—మహామునీ! ఇంత దనుక వచ్చిన పిమ్మట యింకెందుల కీ క్షమాపణ!

గీ. ప్రియసహోదరులు సమసె; ప్రేమసనియె;
మరువరాని వైరముగూడ మాకు గలిగె
యింతయైన పిదప వీనినింక విడిచి
మంచివాడ నగుదునయ్య మౌనినాథ?

విశ్వా—రామా! విచారింపకుడు. అరుగో నీ తమ్ములు నా తపః ప్రభావంబున సజీవు లగుచున్నారు. యయాతీ! నిన్నింక మన్నించితిని. ఆంజనేయా! నీ యనన్య సామాన్య నీతి కానందించితిని.

గీ. సహనమందు యయాతికి సాటిలేరు;
కార్యదీక్షకు రాముడే కలడు సాక్షి;
దయయు, సత్యదీక్షయు, మాతృదైవభక్తి
యన్నిటికి నిలయంబీవె యాంజనేయ!

శ్రీరా—వత్సా ! అనిలతనయా ! ఈ శుభసమయంబున నీ యభిప్రాయమేమియో దెలుపుము.

ఆంజ—ఐన నిట్లగుగాక.

గీ. ప్రజలు నీతివర్తనమందు వరలుగాత
పుణ్యనీయు లశ్రాంతంబు బ్రోచుగాత
ఆయురారోగ్య విభవంబు లలరుగాత
ధరణి శ్రీరామనామంబు దనరు గాత.

అందరు—తథాస్తు.

మంగళమ్



నలందా ప్రెస్, మారీసుపేట-తెనాలి